# సోమనాథ విజయము

(ఇది రంగముల నాటకము)

రోంప నరసింహ శాస్త్రి

నేరివారు
. రేపల్లె .

వెల రూపాయి

# సోమ నాథ విజయము

(ఆరు రంగముల నాటకము)

నోరి నరసింహ శాస్త్రి

నోరి వారు
. రేపల్లె .

మొదటి కూర్పు ౧౯౩౪
రెండవ కూర్పు ౧౯౪౪
మూడవ కూర్పు ౧౯౫౫

వెల ఒక రూపాయి



కల్యాణీ ప్రెస్ . తెనాలి

# టిప్పణములు

ప్రభాస పట్టణము : సోమనాథ దేవాలయ మున్న పట్టణము.

హాగదత్తుడు : బులందు షహరు రాజు. మహమ్మదు గజ్నవీ దండెత్తి రాగానే ఇతడు పదివేలసైన్యముతో ఇస్లాము మతము స్వీకరించినాడు.

చాప్ రాయి : ఇతడు షాహ్యారాజు. సుల్తాను మహమ్మదు, అతని అనుచరులూ హిందువులవలె నల్లనివాళ్ళు కాగని విని భయముతో పారిపోయినా డట !

అనంగపాలుడు : 'మహమ్మదీయ మహాయుగములో' ఈ పే రున్నది. ఇతర చరిత్రకారులు అతని పేరు ఆనందపాలు డని వ్రాసినారు.

రుస్తుమ్ : పారసీ వాఙ్మయములో మహావీరు డని ప్రసిద్ధి పొందిన వాడు.

అలీ : మహమ్మదీయులలో ధర్మాత్ముడు.

కాబా : మక్కా పట్టణములోని పవిత్రశిల.

మహమ్మదు గజ్నవీ బిరుదులు : సుల్తాన్ — ఇది రాజ్యానికి రాగానే అతను పెట్టుకొన్నది. సైఫ్ అద్దౌలా = సామ్రాజ్యపు ఖడ్గము. ఘాజీ — జయశాలి. బత్షికన్ = విగ్రహధ్వంసకుడు. అమీన్ ఉల్ మిల్లాత్ = (ఇస్లాము) ధర్మరక్షకుడు. యామినిన్ అద్దౌలా = సామ్రాజ్యపు దక్షిణ హస్తము.

# పాత్రలు

ముగ్గురు పౌరులు
ప్రాశ్నికుడు
వృద్ధురాలు
ఒకతె
ఒకడు
భటుడు
ఏడుగురు అర్చకులు
మహంతు
సోమనాథుడు
వార్తాహరుడు
నలుగురు భటులు
గజ్నవీ
ఇద్దరు అనుచరులు

# ఒకటవ రంగము

[సోమనాథ దేవాలయపు తూర్పు గోపురద్వారమునకు ఎదుట నున్న విశాల ప్రదేశము. అంతటను ఉత్సవ కోలాహలము. ద్వారమునకు కొంత దూరములో ఉత్సవోద్రేకముతో ధన వంతు లగు ముగ్గురు పౌరులు ప్రవేశింతురు.]

మొదటి వాడు

జయీా భవ సోమనాథ !

రెండవ వాడు

దిగ్విజయీా భవ సోమనాథ !

మూడవ వాడు

.. వందే సోమనాథ !

రెండవ వాడు

దేవాలయ శిఖరముమీాది సువర్ణకలశము సంధ్యాకాంతిలో రక్తకాంతులు వెదజిమ్ముతున్నది.

మొదటి వాడు

త్రిపురాంతకుని రూపమువలె నున్న దీ మ్లేచ్ఛధ్వంసి యైన మహాదేవుని ఆలయము.

మూడవ వాడు

ఈ సంధ్యావేళలో తాండవించే సోమేశ్వరునిమూర్తి మీా కిప్పుడు తలపుల్లోకి రావడం లేదా? ఆ భ్రమణవేగమువల్ల పుట్టి ఈశ్వరుణ్ణి ఆవరించిన అగ్నిజ్వాలలను అనుకరించడము లేదా దేవాలయ మావరించిన ఈ అరుణ కాంతులు!

మొదటి వాడు

అవు నవును. నూతనంగా కట్టిన ఈ ప్రాకారము తాండవే శ్వరుని గజచర్మమువలె ఉన్నది. సోమనాథు డిప్పుడు ప్రళయ తాండవము ప్రారంభించి ఉంటాడు!

రెండవ వాడు

దిగ్విజయీ భవ, సోమనాథ!

[బెదురుచూపులతో తప్పుకుంటున్న వానివలె పారశీకుడు ప్రవేశించును.]

పారశీకుడు

అయ్యలారా!

మొదటి వాడు

ఏమది?

పారశీకుడు

నాకు సిగ్గవుతున్నది! నే నీ దేశానికి కొత్త. ఈకోలాహల మేమో నాకు దయచేసి తేటపరచగలరా? ఇప్పటికి నే నడిగిన వాళ్ళందరూ నవ్వి నన్ను వెళ్ళగొట్టినారు.

[మొదటివాడు పెద్దపెట్టున హేళనగా నవ్వును]

రెండవ వాడు

సోమనాథుని విజయోత్సవము ఎరగనందుకు నీవు నిజముగా సిగ్గుపడ వలసినదే.

మూడవ వాడు

మీ దేదేశ మేమిటి?

పారశీకుడు

మాది పారశీకము.

మూడవ వాడు

మా సోమనాథస్వామికి కానుక లర్పించడానికి వచ్చినావా?

పారశీకుడు

కాదు——

[మొదటి ఇద్దరు పౌరుల కన్నులలోనూ ముఖాలలోనూ కోపసూచనలు వ్యక్త మవుతవి. మూడవవాడు విస్మయము చూపి ప్రశ్నబోధకమైన చూపు చూస్తాడు.]

కాదు. సోమనాథుని సంగతి తెలిస్తే ఇవ్వాళ ఇన్ని చోట్ల పరాభవాలు పొందడ మెందుకు! అరబ్బులు మమ్మును మా దేశములోనుండి పారదోలగా ఇక్కడ తల దాచుకుం టున్నాము.

మొదటి వాడు

అయ్యో! మీ దేశము వదలి వచ్చినావా? మా సౌరాష్ట్రము విడిచి వెళ్ళడానికి మా ప్రాణా లొప్పవు!

రెండవ వాడు

ఎప్పుడైనా ఒకరోజు పనిమీద ప్రభాసపట్టణపు పొలిమేర దాటి ఉంటేనే గుబులు గుబులుగా ఉంటుంది.

మూడవ వాడు

అయితే, మీ దేవాలయాలు ఎట్లా విడిచి వచ్చినారు ?

పారశీకుడు

మా కక్కడ విడిగా దేవాలయాలు లేవు. మా వసతి ఇళ్ళే

మా దేవాలయాలు. విమతస్థులు మమ్ము అక్కడనుంచి బలవంతాన పారదోలినప్పుడు వాటిని విడిచి గాక చేసే దే మున్నది!

మూడవ వాడు

అయ్యో!

రెండవ వాడు

ఆలయము కట్టించ లే దని దేవునికి మీామీాద కోపము వచ్చి ఉంటుంది

మూడవ వాడు

అరబ్బు లంటే ఎవరు?

పారశీకుడు

అరబ్బులా? ఇస్లాము మతస్థులు. వాళ్ళమనస్సుల వలెనే వాళ్ళ మసీదులు శూన్యమైనవి. వాళ్ళ అల్లాగూపము వాళ్ళ దేవాలయాలలో కాదు ఉండేది. ఆయన భక్తుల చేతులలో మెరసే కత్తులే ఆయన రూపము.

రెండవ వాడు

మీా దేవు డెవరు?

పారశీకుడు

మేము సర్వోత్తము డైన అగ్నిని పూజిస్తాము!

రెండవ వాడు

అగ్నియా?పూజార్హు డే. కాని మా దేవుని సేవకులలో ఒకడు.

మొదటి వాడు

అగ్నిని మా ఈశ్వరుడు నొసట ధరించినాడు. ప్రసన్నుడై ఉన్నంతసేపూ ఆ అగ్ని నేత్రము కనబడదు.

పారశీకుడు

అగ్ని సర్వశక్తిమంతుడు. ఆయనవాంఛితము వల్లనే లోకము సృష్టి ఐనది. ఆయనమహిమచేతనే లోకము సజీవమై వెలుగుతున్నది. ఆయనశక్తియే—

రెండవ వాడు

మిమ్ములను ఓడించి మీ దేశమునుండి వెళ్ళగొట్టినది. మీరు నివసించే ఇళ్ళను భస్మము చేసినది.

[ఆలయములోనుండి సోమనాధస్వామి విజయఘంటానాదములు వినవచ్చును.]

పారశీకుడు

[సిగ్గుతో తల వంచుకొని కన్నీటిబొట్టొకటి విడుస్తూ] అయ్యో!

మొదటివాడు

అట్లా అనరాదు. నాస్తికులైన మ్లేచ్ఛులు నగరకోట దేవాలయము కొల్లగొట్టలేదా? స్థానేశ్వరము ధ్వంసము చేయలేదా? మధురలో ఎన్ని ఆలయాలు భస్మము చేసినారు! ఈశ్వరాలయాలు మనుష్యులు రక్షించుకోవలెగాని ఈశ్వరుడు రక్షించుకొంటాడా?

పారశీకుడు

వాళ్ళే! వాళ్ళే!

మొదటి వాడు

వాళ్ళంటే ఎవరు?

పారశీకుడు

నగరకోట స్థానేశ్వరము మధుర జయించినవాళ్లే మమ్మునూ మా దేశమునుంచి తరిమివేసినారు.

మూడవ వాడు

ఏమిటి? మిమ్మును వెళ్ళగొట్టినది ఈ మహమ్మదీయు లన బడే గోబ్రాహ్మణ హంతి లేనా ?

రెండవ వాడు

మా సోమనాథుని కటాక్షముచేత కలియుగ పరశురాము డైన అనంగపాలుడు వాళ్ళను నిరుడే పారదోలి బ్రాహ్మణ వర్ణానికి క్షత్రియశోభ ఘటించినాడు.

మొదటి వాడు

స్థానేశ్వరము నగరకోటలలోవలె కాదు; మా సోమేశ్వర స్వామి సర్వశక్తిమంతుడు.

రెండవ వాడు

ఈ ప్రభాస పట్టణములోని మహానటుడు మధురలోని జిన దేవుని వంటివాడు కాడు.

మొదటి వాడు

అనంగపాలుడు నిమిత్తమాత్రు డైనాడే కాని సోమనాథ మహాదేవునికి మ్లేచ్ఛులను పారదోలడ మెంత పని !

మూడవ వాడు

ఆయన సత్యము లోకానికి వెల్లడి చేయడానికి ఇప్పు డంతి రిక్షములో నిరాధారంగా నిలిచినాడుగా ! ఇంకా అంతకంటె ఏమి కావలెను ?

[ఆ మాటలకు పౌరులు ముగ్గురూ కళ్ళు మూసుకొని భక్తితో సోమనాథుని ధ్యానించి శిరస్సుపైకి చేతు లెత్తి నమస్కరింతురు.]

పారశీకుడు

ఏమిటది !

మూడవ వాడు

పూర్వము సోమనాథుని లింగము సముద్రతీరాన ఉండేది. ఈశ్వరునికి సముద్రుడే స్వయముగా కరపరంపరలతో నిత్యాభిషేకము చేస్తూ ఉండేవాడు. మ్లేచ్ఛుడు వెనుకటి సంవత్సరము ఈ ఆలయనుమీద కన్ను వేసినా డని తెలిసిన పిమ్మట సోమనాథస్వామి తనమహత్త్వము చూప దలచి అంతరిక్షములో ఉండ దలచినా నని కలలో భక్తులకు కనపడి చెప్పినాడు. అందువల్ల సహస్రగుణముగా సుందరమైన ఈ దేవాలయము కట్టించి గర్భాలయములో అంతరిక్షమందు ఆధారము లేకుండా లింగప్రతిష్ఠ చేసినారు. ఆ ఉత్సవమే గదా ఇది !

పారశీకుడు

ఇది దేవుని మహత్త్వమా! ఏదో ఇక్కడ శిల్పులమహత్త్వ మున్న దని వింటిని.

ముగ్గురూ

శాంతం పాపమ్ !

మూడవ వాడు

దుష్టుల నోటి కడ్డము లేదు. వాళ్ళనాలుకలు పాములనాలుక లవలె విషపూరిత మైనవి.

రెండవ వాడు

అట్లా అనేవారి నాలుకలు తుండెములై పోతవి.

పారశీకుడు

మన్నించండి! నా చెవుల బడ్డదేదో అది ఆలోచనలేకుండా అన్నాను. మీకు కోపము కలిగించవలెననే ఉద్దేశ మేమాత్రమూ లేదు. క్షమించండి!

మూడవ వాడు

క్షమించేది మేము కాదు. ఆ సోమనాథుని యెడల చేసిన అపరాధము కృపానిధి ఐన ఆ సోమనాథుడే క్షమించవలెను.

మొదటి వాడు

ఇంతే కాదు. దుర్మార్గుల దురంతాలకు అంతు లేకున్నది. సోమనాథుని కృపచే అనంగపాలుడు గజినీని పరాభవించి కానుకగా తెచ్చిన ధనముతో ఈశ్వరుని వైభవార్థము ఈ దేవాలయము చుట్టూ బలిష్ఠమైన ప్రాకారము కట్టించినాడు. మళ్ళీ ముసల్మానులు వచ్చి దేవాలయము ముట్టడించే యెడల సోమనాథ రక్షణార్థ మీ గోడ కట్టించినారని కూడా వదంతి పుట్టించినారు. కాని సోమనాథస్వామి మనుష్యసహాయము కావలసినంత అసమర్థుడు కాడు!

రెండవ వాడు

అట్లా పలికేవాళ్ళ జిహ్వాలు చీల్చి వేయవలెను!

పారశీకుడు

మీ దేవుని పూజ చేయటానికి నన్నుకూడా మీవెంట దయతో తీసుకొని పొండి!

రెండవ వాడు

మ్లేచ్ఛులు దర్శనము చేస్తే మా దేవు డపవిత్ర మౌతాడు.

పారశీకుడు

ఐతే మా బోటి అభాగ్యులగతి యేమి?

మూడవ వాడు

దేవునికి అపవిత్రత లేదు. కాని మ్లేచ్ఛులను మా దేవాలయము లోనికి రానియ్యడము మా ఆచారము ఒప్పదు.

పారశీకుడు

అచల మైన మీ దేశమే మాకు నిలవ నీడ ఇచ్చినదే! కరుణాసింధు వైన మీ ఈశ్వరుడు మమ్మును దర్శనకు రానీయడా? ఐతే నా గతి ఏమిటి?

మూడవ వాడు

ఇక్కడనే ఉండి భక్తితో సోమనాథుణ్ణి మనస్సులో ధ్యానము చేసినా ఆ సర్వత్రాణుడు పాపాలు పోగొట్టుతాడు.

[ఒకానొక వృద్ధస్త్రీ చేతులెత్తి బిగ్గరగా రోదనము చేస్తూ ద్వారమువద్దనుండి వీళ్ళవైపు పరుగెత్తుకొని వస్తున్నది.]

పారశీకుడు

అయ్యో! నా కిది చేతకాదే. వ్యర్థుడను! [అని విచార భారముతో మెల్లగా నిష్క్రమించును.]

మూడవ వాడు

పాపము!-అవ్వా, ఏమి అట్లా ఏడుస్తావు ఈ ఉత్సవసమయంలో?

వృద్ధురాలు

కొట్టినారు. నన్నక్కడనుంచి గెంటివేసినారు!

మూడవ వాడు

ఇంత వృద్ధాప్యములో ఉన్న నిన్ను ఎక్కడనుంచి గెంటివేసినారు ? గెంటివేసిన ఆ దురాత్మకులు నీ ఆప్తులేనా ?

వృద్ధురాలు

నా కాప్తు లెవ రున్నారు ? ఆప్తులు కారు. [దేవాలయ ద్వారమువంక చూపుతూ] వాళ్ళు !

రెండవ వాడు

[చిరునవ్వుతో] ఓహో ! దేవాలయద్వార రక్షకులా ?

మూడవ వాడు

అమ్మా, కాస్త విశ్రాంతి తీసుకొని నీ కథ మాకు విశదీకరిస్తావా ?

వృద్ధురాలు

నే నాంధ్ర దేశమునుంచి సోమనాథుని అర్చించే నిమిత్తము వచ్చినాను నాయనా ! చెట్టంతకొడుకులు యుద్ధములో మా రాజుకు ప్రాణాలు అర్పించినారు. ఆప్తు లంతా నన్ను ఈ లోకంలో ఒంటరిదాన్ని చేసి పోయినారు !

మూడవ వాడు

అయ్యో, నీకూ ఆగతే పట్టినదా ?

వృద్ధురాలు

కాశీ విశ్వనాథుణ్ణి సేవించి ప్రయాగ వచ్చి సౌరాష్ట్రములో జ్యోతిర్లింగమూర్తి నా ఆత్మలో అజ్ఞాన తిమిరము హరించగల ఆప్తు డని ఈ సోమనాథస్వామిమీద భక్తితో ఇక్కడికి వచ్చినాను. భక్తులపాలిటి ఈశ్వరుణ్ణి ధనికులపాలిటి రాజునుగా

మార్చి వేసినారు. ఈ ద్వారరక్షకు లేమిటి? ఈ భటు లేమిటి? ఈ వేళ వేయిసువర్ణా లర్పించే వారినే కాని దేవదర్శనానికి పోనీయరంట! ఇక మాబోటి పేద లేమి కావలెను!

మూడవ వాడు

వెఱ్ఱిదానా! తొందర వద్దు. కొంచె మోర్చుకో! పేద లందరూ ఈశ్వరదర్శనము చేసికోగలందులకు కొన్ని వేళలు నియమించినారు గాదా! అందాకా ఓపిక పట్టి ఆగి ఉండ లేకపోతివా?

వృద్ధురాలు

దేవదర్శనానికి రాజదర్శనానికివలె వేళ లేమిటి? ఈవిధంగా పేదవాళ్ళు దర్శించటానికి నియమిత వేళ లుంటేనూ ధనికులను మాత్రమే దేవు డన్ని వేళలా ఆదరిస్తేనూ మానవమాత్రుడైన రాజుకూ దీనరక్షకు డైన ఈశ్వరునకూ భేద మేమున్నది?

మూడవ వాడు

అవు నమ్మా! ఈశ్వరుని భోగము ఈ లోకంలో రాజ భోగమువంటిదే! పాపము, అంతదూరమునుంచి వచ్చి ఆశా భంగము పొందినందువల్ల నీమతి కొంచెము చలించిన ట్లున్నది. మాతో వస్తే నీకు దేవదర్శనము చేయిస్తాము రా!

రెండవ వాడు

పిచ్చిది! వెఱ్ఱిభక్తి!

మొదటి వాడు

[తూర్పువైపు చూచి] ఏమిటా సందడి!

రెండవ వాడు

ఎవరో సంపన్నుడు స్వామివారలకు కానుక లర్పించ బోతున్నాడు. సేవకులు తోవ చేస్తున్న ట్లున్నది.

భటుడు

[ప్రవేశించి బిగ్గరగా] ఉజ్జయినీ రాజకుమారుడు, స్వామి వారి సన్నిధికి వేంచేస్తున్నాడు. తొలగండి! తొలగండి! [అని తన రజతవేత్రముతో జనసమ్మర్దము సర్దును. ముసలి పేదరాలు వృద్ధురాలు కూడా పక్కకు ఒత్తిగిలవలసి వస్తుంది. ఉజ్జయినీ రాజకుమారుడు రాజచిహ్నములతో రథముమీద వేగముగా దేవాలయ ద్వారముపైపు దాటి పోవును.]

మొదటి వాడు

ఏ మాగర్వము!

రెండవ వాడు

అదా, ఐశ్వర్య మదము! ఈశ్వరుని వద్దకు వెళ్ళడాని కంత సంరంభ మెందుకో!

మూడవ వాడు

బాబులారా! ఎందుకు మీ కంత కోపము! ద్వారమువద్ద ఆరాజపుత్రుడు రథము దిగి పాదుకలు విడిచి పాదచారి ఐ దేవదర్శనార్థము వెళ్ళుతున్నాడు. కవికుల కల్పవృక్షమైన భోజునికుమారుని కంతమాత్రము తెలియదా? మనమూ వెళ్లు దాము! [వాళ్ళందరూ ఆలయద్వారము సమీపించినారు.]

ద్వార రక్షకులు

మీ రేమి కానుకలు తెచ్చినారు?

పౌరులు

మా శ క్త్యనుసారము !

ద్వార రక్షకులు

ఐతే ఒక గడియసేపాగవలె! అప్పుడు మీ కానుక లర్పించవచ్చును.

మూడవ వాడు

ఇంకా ఇప్పుడు వెళ్ళరాదా ఏమి ?

ద్వార రక్షకులు

అంత తొందర ఏమి ? మీ కానుక లందుకోకుండానే సోమనాథుడు ఇంకా కొంతసేపు ఆగి ఓర్చుకొని ఉండగలడులెండి ! దోవ కడ్డముగా నిలుచో బోకండి !

[పరాభవము పొంది పౌరులు వెనుకకు తిరిగి వస్తూ ఉంటారు. అప్పుడు సోమనాథుడు ఉన్మత్తవేషముతో ఆకస్మికముగా ప్రవేశించును. కొంతసేపు రాళ్ళు పడి ఆగిపోవును.]

సోమ నాథుడు

సోమేశ్వరునికి కోపము వచ్చినది ! ఆయనకు సంకెళ్లు వేసినారు. ఆయనను కారాగృహంలో బంధించినారు. ఆయన ఇక ఇది ఎన్నాళ్లో ఓర్వడు. శత్రుపక్షంలో చేరబోతున్నాడు. భక్తులంతా ఈశ్వరుణ్ణి విడిపించక ఊరుకుంటారేమి ?

మొదటి వాడు

[నిర్వేదపాటుతో] ఏమి టది !

రెండవ వాడు

[నిర్వేదపాటుతో] ఏమి టది !

మూడవ వాడు

[నిర్వేరపాటుతో] ఏమి టది!

సోమ నాథుడు

ఏమి టని అట్లా ఊరుకుంటా రేమి? ఈ అర్చకులు ఈశ్వ రుణ్ణి బంధిస్తున్నారు. సముద్రతరంగాల నిసర్గనిత్యాభిషేకంతో తృప్తి పడుతూ ఉండే గంగాధరునికీ ఆడంబర మెందుకు? భక్త లందరికీ అందుబాటులో ఉండవలె ననుకున్న దయామయుణ్ణి సంపన్నులు తమవాణ్ణి చేసుకోవలె అని ప్రయత్నిస్తున్నారు. వాళ్ళ ఆశాపిశాచము మానవులను బానిసలుచేసుకోవడముతో తృప్తి తీరక భూతేశుని కూడా చెనక బోతున్నది. భక్తుల కందరికీ సోమనాథుని అవస్థ ఇంకా తెలియ లేదా ఏమిటి?

వృద్ధురాలు

మహాత్మా, నేను నీ శిష్యురాలను! నన్ను వెళ్ళగొట్టడాని కీ ద్వారపాలకులకు సోమనాథస్వామి అధికార మిచ్చినాడా? దేవుడు వరమిచ్చినా పూజారి వర మియ్యడు!

సోమ నాథుడు

దేవకార్యానికి అంతా పెద్దలే. ఒకరి కని ప్రత్యేకించి అధి కార మెవ రిచ్చినారు? ఈఅర్చకుల ఆశకు మితము లేకున్నది.

వృద్ధురాలు

లేదు, లేనే లేదు! మహాదేవుని అల్పదేవుణ్ణిగా మార్చివేసి నారు స్వామీ!

రెండవ వాడు

ఈ సోమనాథుడు ప్రధానార్చకులలో ఒకడు కాడా!

మొదటి వాడు

ఏమిటో, ఆ అర్చకులలో ఏమి పోట్లాటలు వచ్చినవో !

రెండవ వాడు

వదంతులలో కొంత నిజమే ఉన్నదేమో! అసలేదో రవ్వంత నిజమైనా లేనిది ఊరికే వాదులు పుట్టునవా ?

మూడవ వాడు

తొందర పడకండి! [సోమనాథునితో] అయ్యా, సోమనాథా! ప్రధానార్చకులలో ఒకరైన మీరే ఈవిధముగా అర్చకులమీద దాడి వెడలినారేమి ?

సోమనాథుడు

సోమేశ్వరుని ఆజ్ఞ! స్వామి ఈ అలంకారాలతో అలసిపోయినాడు. ఈ వైభవముతో ఆయన శిరస్సు బద్దలవుతున్నది. రుద్రునికి కోప మంకురించినది. యథాప్రకారము జ్యోతిర్లింగము సముద్ర తీరాన ఆలయంలో ప్రతిష్ఠించితేనేగాని మహేశ్వరుని కోపము శాంతించదు.

మూడవ వాడు

సోమనాథస్వామికి భక్తిశ్రద్ధలు చూపడమాయన కిష్టము లేదా ? మీకు మతి కొంచెము భ్రమించలేదు కదా!

సోమనాథుడు

నాకు పిచ్చి ఎత్తినదని అంతా అంటున్నారు. నిజమే. ఈశ్వరునికి మళ్ళీ స్వేచ్ఛ కలిగే దాకా, మృత్యుంజయునికి విజయము కలిగేదాకా నాకు పిచ్చి వదలదు. [అంటూ సోమనాథుడు నిష్క్రమించును.]

వృద్ధురాలు

జయ సోమనాథ !

ముగ్గురు పౌరులు

[అప్రయత్నముగా] జయ సోమనాథ !

[ఒక జాగంట గణగణ మ్రోగుతున్నది. వెంటనే కలకలము ప్రారంభించినది. 'దేవదర్శనానికి అందరూ వెళ్ళవచ్చును' అనే కేకలు వినబడు తున్నవి.]

మూడవ వాడు

[వృద్ధురాలితో] అమ్మా! ఈ కలకలము కొంచెము తగ్గి పోయిన తర్వాత లోపల ప్రవేశించుదాము. ఈ సందడిలో జనము ఒత్తిడికి నలిగిపోతాము.

వృద్ధురాలు

బందిఖానాలో ఉన్న సోమనాథుణ్ణి చూడకపోతే మాత్ర మేమి ? చూచి శోకించడానికే గదా !

[దేవాలయములో భక్తులు గణగణ మ్రోగిస్తున్న గంటల ధ్వని వినవస్తున్నది.]

మూడవ వాడు

ఆ గంటలువిను ! వెఱ్ఱిదానా, ఆ ఉద్రేకపూరితుని మాటల చేత పిచ్చిదానవు కావద్దు ! ఆ ఘంటాధ్వనిలో ఈశ్వరునిపిలుపు నీకు వినరావడం లేదా ? నీకు సోమనాథస్వామిని దర్శించవలె ననే ఉద్వేగము అతిశయించడము లేదా ! ఉద్రేక పూరితుని మాటలతో పిచ్చిదానవు కాబోకు !

వృద్ధురాలు

ఉద్రేకపూరితుల జిహ్వాలమీద నేగదా భవుడు నాట్యమాడేది!

మూడవ వాడు

అవు గాక! ఆ ఉద్రేకపూరితుల జిహ్వాలే అసంబద్ధ ప్రలాపాలకు ఆటపట్టు లనే సంగతి మనము మరుస్తే ఎట్లాగు?

రెండవ వాడు

కాకపోతే సోమనాథునికి సంకెళ్ళు వేసినా రనడ మేమిటి?

మొదటి వాడు

ఏమోలే!

[ముగ్గురుపౌరులూ దేవాలయద్వారంవైపు పరిక్రమింతురు. వృద్ధురాలుకూడా సందేహముతో అడుగులు వేస్తున్నది. జనులు దేవాలయమునుంచి వచ్చేవారూ, లోపలికి పోయేవారుగా ఉన్నారు.]

ఒ క రు

అయ్యో! నన్ను పీపు పగిలే టట్లు భటులు కొరడాలతో కొట్టినారు!

ఒ క రు

నే నొక్క దెబ్బతోనే అవతల పడ్డాను.

ఒ క రు

నాకు దేవదర్శనము చక్కగా ఐనది.

ఒ క రు

అంతరిక్షములో ఉన్నస్వామి ఎంత కనులపండువుగా ఉన్నాడు! ఏ మాయన సత్యము!

ఒ క రు

ఏమో గాని నా కళ్ళకుమాత్రము అట్లా కనబడ లేదు. చీకటిలో ఉండడమువల్ల కాబోలును. జ్యోతిర్లింగ స్వరూపము కాంతి తగ్గినట్లు కనిపించినది. సోమనాథస్వామి తనను పూర్వాలయంలోనుంచి మార్చినందుకు చింతిస్తున్నా డేమో!

['ఛా! అతనినోరు మూయండి! రాళ్ళు రువ్వండి! ఛా! ఛా! ఛా!' అనేధ్వను లంతటా కొంతసేపు వినబడి, నెమ్మదిగా శాంతి పొందుతవి.]

ఒ క రు

[కుంటుతూ]అయ్యో! తొక్కిడిలో నాకాలు నలిగిపోయినది!

ఒ క రు

ఒత్తిడికి ఒక శిశువు నలిగి ప్రాణాలు సోమనాధునికి బలి యిచ్చినదని కూడా అనుకుంటున్నారు. పాపము! కాస్తవ్యవధి లోనే తప్ప అంతా దేవదర్శనార్థము వెళ్ళ వీలు లేదాయెమరి!

ఒ క రు

శిశువు చనిపోవడము ఆశ్చర్య మేమిటి! మనబోటివాళ్ళకే ప్రాణాలు కడబట్టితేను!

ఒ క తె

నాచంద్రహారము పోయినది. భర్తకేమని జవాబు చెప్పేది!

ఒ క తె

నా చెలికత్తె ఒడలంతా నలిగి చిదికిపోయినది! ఏమమ్మా, అయ్యో! ఎప్పుడూ ప్రాతస్సమయంలో కూడా ఇంత ఖిన్నవై నీవు కనిపించలేదే!

వృద్ధురాలు

దేవాలయములోనికి నే నిక రాను. అయ్యలారా, మీకిష్టముంటే మీరు వెళ్ళవచ్చును. న న్నిక్కడ వదలండి!

మూడవ వాడు

దూర దేశమునుండి వచ్చినావు! జనసమ్మర్దము తగ్గినది. నామాట విని మావెంట రా!

వృద్ధురాలు

నేను రాను. ఇంతటి దురంతాలు జరిగేచోట నా అడుగు మోపను. వ్యర్థుడ ననుకుంటూ వెళ్ళిపోయిన ఆ పారశీకునివలె నాస్తోత్రాలు ఇక్కడనుంచే సోమేశ్వరునికి అర్పించుకుంటాను.

ముగ్గురు పౌరులు

చెప్పితే విన వాయెను! ఏం చేస్తాము!

[పౌరులు దేవాలయములోనికీ, వృద్ధురాలు తూర్పుదిక్కుగాను నిష్క్రమింతురు.]

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

# రెండవ రంగము

[దేవాలయములో మంటపముమీద ఏడుగురు ప్రధానార్చకులూ మహంతూ సభ. ఒక శూన్యాసన మున్నది. సభకు చేరువనే మంటపముక్రింద భటు డొక డున్నాడు.]

మ హం తు

[శూన్యాసనమువంక చూచి]సోమనాథుడు రాలేదు కాబోలు?

భ టు డు

రా లేదు.

ఒకటవ అర్చకుడు

అతని విషయము చాలా గోలగా చెప్పుకుంటున్నారు.

రెండవ అర్చకుడు

అతడు ప్రజలకు మన అందరితో విరోధము ఉద్బోధిస్తున్నాడట గా!

నాల్గవ అర్చకుడు

సోమనాథునికి సంకెళ్ళు వేసినందుకు ఈశ్వరునికి కోపము వచ్చిన దని కేకలు వేస్తున్నాడు.

ఐదవ అర్చకుడు

పాపము, భక్తి పారవశ్యముచేత అతనికి మతి చెడ్డట్లున్నది.

ఆరవ అర్చకుడు

అతను ప్రధానార్చకులలోవాడు కావడము మన కందరికీ
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

ఏడవ అర్చకుడు

స్వామి పునః ప్రతిష్ఠ తలపెట్టిన దాది అతని మన స్సేదో కలత బారినది.

మ హం తు

మేమూ వింటూనే ఉన్నాము.

మూడవ అర్చకుడు

సోమనాథుని మాటలు ప్రజల మనస్సులలో నాటుకొని భావాతీత మైన విప్లవము కలిగిస్తున్నవి.

నాల్గవ అర్చకుడు

అతని కేకలకు కొందరు మాత్రము రాళ్ళు విసరినప్పటికీ, ఎందరో దాసానుదాసులై అతని శరణు చొచ్చుతున్నారు.

ఏడవ అర్చకుడు

అతని ప్రవర్తనము భయంకరముగా ఉన్నది.

మ హం తు

మాకే అతడు వెరపు కలిగిస్తున్నాడు.

రెండవ అర్చకుడు

[ఆశ్చర్యముతో] ఏమిటి!

ఆరవ అర్చకుడు

ఈ సోమనాథుణ్ణి నోరెత్తకుండా అణచి పెట్టవలెను. ఇతని పిచ్చి మాటలకు భయపడి మన ఈశ్వరునికి వైభవము ఎక్కువ చేసి మన భక్తి చూపక ఊరుకుంటామా?

రెండవ అర్చకుడు

అది గాక స్వామి పునః ప్రతిష్ఠను అర్చకులు వేయిమందీ

బహిరంగ సభలో ఆమోదించినారు గాదా! ఇక ఈ ఒక్క సోమనాథుడు దాని నాటంక పరచడానికి కేవడు?

మహంతు

నిజమే కాని సోమేశ్వరునికే ఈ పునఃప్రతిష్ఠ ఇష్టము లేదేమో!

ఏడవ అర్చకుడు

సముద్ర తీరాన స్వయంప్రకాశు డైన సోమనాథుడు ఈ నూతనాలయ ప్రవేశము అంగీకరిస్తాడా?

ఆరవ అర్చకుడు

సోమనాథేశ్వరుడే స్వయముగా ఎందరికో స్వప్నములలో సాక్షాత్కరించి తన సత్యము ప్రకటించడానికి నూతన దేవాలయ సృష్టి కోరినాడు గదా!

మహంతు

ఏమో, కల లన్నీ నిజములా?

రెండవ అర్చకుడు

తమకు ఈశ్వరుడు స్వప్నములో ప్రత్యక్షమై తనవాంఛ తెలిపినట్లు తమరే సెల విచ్చి ఉన్నారు గదా!

మహంతు

అవు గాక! మా కెన్నాళ్ళుగానో ఉన్నకోరిక భావనా బలంచేత స్వప్నంగా పరిణమించి మనల నందరినీ మోసగించి ఉండ గూడదా?

రెండవ వాడు

అంతే గాక ఇంకా ఎన్నో నిదర్శనాలుకూడా కనపడ్డవిగదా!

మ హం తు

అవును. కాని దీనికి ప్రస్తుత ముపాయ మాలోచింప వలసి ఉన్నది. యాత్రికులలో విప్లవము కలిగినతర్వాత ఈ దేవాలయము రక్షించుట అసాధ్యము. మనవ్యయప్రయాస లన్నీ వ్యర్థ మవుతవి.

ఆరవ అర్చకుడు

దీని కింత ఆలోచన ఎందుకు ? నాస్తికుడై ఈశ్వరదూషణ చేస్తున్న ఈసోమనాథుని శిరశ్ఛేదము చేయించుదాము. మన నిరంకుశత్వము నిక్కడ అడ్డగించ సాహసించేవా ళ్ళెవరు ?

కొందరు అర్చకులు

[భయముతో] అంత పనా ?

మ హం తు

మన మంత తొందర పడ రాదు. ఆశిక్ష పొంద దగినంత తప్పు సోమనాథు డిప్పటికి చేయ లేదు. అది గాక యాత్రికుల కది ఉన్మాదము కలిగిస్తుంది.

ఒకటవ అర్చకుడు

సామ మవలంబించుదాము.

మ హం తు

నూఉద్దేశమూ అదే. మంచిమాటలతో స్వాధీనము కాక పోతే బెదరించవచ్చును. ఐనా నా కి దంతా ఏదో కంపరము పుట్టిస్తున్నది. [సభవా రంతా ఆశ్చర్యము స్ఫుట పరతురు.]

ఐదవ అర్చకుడు

ఐనా ఇంత మనోహర మైన నూతన దేవాలయ నిర్మాణా

నికీ, అమృతావహ మైన ఈపునఃప్రతిష్ఠకూ చాలిన త శాంతి జరిగినట్లు లేదు.

మూడవ అర్చకుడు

ఆ అసంతృప్తి వల్లనే ఈశ్వరుడు సోమనాథునినోట నట్లా పలికిస్తున్నా డేమో!

ఆరవ అర్చకుడు

ఆర్యా లీలాగున సెలవియ్యడమువల్ల నా కాశ్చర్య మవుతున్నది! ఈ శాంతి చాలదా? ఈశ్వరునికి కోటి పూజలు చేయించినాము. పూజా పుష్పాలకే పది వేల సువర్ణాలు, హారతులకు వేయీ, ధూపద్రవ్యాలకు లక్ష సువర్ణాలూ, ఖర్చు చేసినాము గదా! దేశదేశాలలో ఉన్న ప్రవీణు లంతా వచ్చి నృత్తగీతవాద్యాలు అర్పించినదీ, వాళ్ళకు మన మిచ్చిన బహుమానములూ, చేసిన సన్మానాలూ మన మందరమూ కళ్ళారచూచే ఉన్నాము. లక్ష బ్రాహ్మణ్యానికి సంతర్పణ జరిగింది. కోటి దీపాలు వెలిగించినాము. నిన్న ధనికులు తెచ్చినకానుక లే పది కోట్ల సువర్ణా లైనవి. బంగారుగంటల మంజునాదములతో రాత్రింబవళ్ళు దేవాలయము మారుమోగుతున్నదే! అంతా మన మెరిగినదే. ఇంకా ఏమికావలెనో నాకు తోచకున్నది.

మహాంతు

అవును మరి.

భటుడు

దేవా, సోమనాథులవా రిట్లా దయచేస్తున్నారు.

మ హా ం తు

రానిమ్ము. నేనే అతనితో మాట్లాడుతాను.

[ఉన్మాద వేషముతో వెనుకటివలెనే సోమనాథుడు ప్రవేశించును ]

మ హా ం తు

[శూన్యాసనమువంక చూపుతూ ఆదరముతో] ఇక్కడ ఆసీనుడవు కమ్ము !

సోమనాథుడు

నా కాసనములతో పనిలేదు. సుఖాసీనుడనై ఉండడానికి నామన స్సిప్పుడు సంతోషముగా లేదు.

మ హా ం తు

ఈ విచిత్ర మేమిటి సోమనాథా! ఇట్లా మారిపోయినావు! ఈ సభలో నీవు కూర్చుండి మాకెన్నిసారులు అమూల్యమైన మంత్ర మాదేశించి ఉండ లేదు? అది ఇప్పుడు నిరాకరించడము ధర్మమా?

సోమనాథుడు

ధర్మ మేమిటి? సోమనాథుని ఆదేశముకంటె నా కిప్పుడు వేరేధర్మ మేమీ కనబడడము లేదు. ఈశ్వరాదేశ మీసభను నిర్మూలించవలె నని ఉన్నది.

[అందరూ వెరపుతో ఆసనములనుంచి సగము లేచి మళ్ళీ కూర్చుండురు. ]

మ హా ం తు

ఆర్యా, కొంచెము శాంతించుము. శివ మెత్తిన వానివలె

మాట్లాడుతున్నా వేల? సోమనాథా, నా ప్రార్థన విని ముందీ ఆసనము అలంకరించుము. నీవు లేకపోవడమువల్ల ఆసన మెంత చిన్నబోయి ఉన్నదో కాస్త ఇటు చూడుము!

సోమనాథుడు

అయ్యో!—

మ హా ం తు

మరి నీ అభిప్రాయ మేమిటి?

సోమనాథుడు

ఈ దేవాలయమునూ ఈ కోటనూ నిర్మూలించి సోమనాథేశ్వరుణ్ణి యథాస్థానములో సముద్రతీరాన ప్రతిష్ఠించండి. ఈశ్వరుని శిరస్సులోని సోముణ్ణి మళ్ళీ సముద్రుని బాహువులకు స్పర్శసాధ్యుణ్ణిగా చేయండి. సూర్యచంద్రుల కాంతికి దూరు డయ్యేందుకు సోమనాథుడు అంతఃపుర స్త్రీ కాడు. ఈశ్వరుని బంధాలు ఛేదించండి. అప్పుడు నేను యథాస్థానంలో కూర్చుండి శాంతముగా మాట్లాడుతాను. అందాకా నాకు శాంతి లేదు. అందాకా నాకు నిలకడ లేదు.

మ హా ం తు

ఏమి టీ పిచ్చి తలంపు?

సోమనాథుడు

సోమనాథేశ్వరుని ఆజ్ఞ ఐనది. ఈమార్పులపైన ఈశ్వరునికి కోపము వచ్చినది.

ఆరవ అర్చకుడు

[నవ్వుతూ పక్కవానితో నెమ్మదిగా] తనకే ప్రత్యేకించి ఈశ్వరుడు తన కోరిక చెప్పినట్లే మాట్లాడు తున్నాడే!

మ హం తు

ఏమిటి ? సోమనాథుని కీవైభవము ఇష్టము లేదా ? భక్తులాయనకీర్తి దిగంతముల వ్యాపింపచేయడమిష్టము లేదా ? ఆయన విజయఘోష స్వామికి సమ్మతిము కాదా ? మేము పూజించే పువ్వులతో సోమనాథుడు నిండిపోతున్నాడు. మేము వేసే ధూపాలకు లోక మంతా సువాసనతో వాసిస్తున్నది. మంగళహారతుల దివ్యగంధ మంతటా అలముకుంటున్నది. నిరంతరము మోగించే ఘంటానాదములు దిగ్దంతుల చెవులలో ప్రతిధ్వనిస్తున్నవి. మేము వెలిగించే దీపకోటివెన్నెల ఆకాశాన నక్షత్రకాంతులను గేలి చేస్తున్నది. ఈసంతర్పణాలు ఈభజనలు ఈసంకీర్తనలు ఈదానాలు ధర్మాలు అంతా నీవు చూడడం లేదా? ఈనూతన దేవాలయంలో ఈశ్వరుని కీలోకంలో కైలాసము నిర్మించినాము. భక్తులిచ్చిన కానుకల సువర్ణరాసులు పరమేశ్వరునికి విహారయోగ్యమైన కనకాద్రులైనవి ! ఇందుకా ఈశ్వరునికి మామీద కోపము ! మాకున్న భక్తికా ఈశ్వరునికి కోపము !

సోమ నాథుడు

అవును! పిల్లవానికి గొంతువరకూ భోజనము కూరే మూర్ఖమాత ప్రేమవలె ఉన్నది మీభక్తి! మీరు పూజ చేసేపువ్వులతో ఈశ్వరునికి ఊపిరి సలపడం లేదు. మీరు చేసే విజయఘంటా ధ్వనులతో ఆపరమాత్ముని చెవులు బ్రద్దలవుతున్నవి! మీదీపకాంతుల కాయనకళ్లు మిరుమిట్లుకొంటున్నవి. మీధూపగంధాలతో స్వామికి తలనొప్పి పుట్టుతున్నది. సర్వదా భక్తులకు

ప్రసన్ను డయ్యే తండ్రికి మీరు నిర్మించిన దివ్యాలయము చెరసాల ఐనది. మహాకాలు డిది ఇక భరించడు. ఇన్నాళ్ళూ మీమీద జాలిచేత ఓర్పు పూని ఉన్నాడు.

ఆయన ఆలయము నిండా రాసులుగా పేరుకొని ఉన్న సువర్ణ మంతా భస్మము చేసి దేహాన ధరించి తాండవించక ఇంకా ఎక్కువకాలము ఊరుకోడు. ఈశ్వరునికి స్వేచ్ఛ యథా ప్రకార మియ్యండి! [ఇంతసేపూ సభ్యు లంతా పాత్రానుసార ముగా వివిధభావాలు చూపుతారు.]

రెండవ అర్చకుడు

[హాసముతో పక్కవానితో నెమ్మదిగా] పాపము, సోమ నాథస్వామి ఈ సోమనాథుణ్ణి శరణు చొచ్చిన ట్లున్నాడే!

మ హా ం తు

సోమనాథా, నీవు ప్రాకృతజనునివలె మాట్లాడుతున్నావు. మన మిప్పుడు చేసినదానిలో శాస్త్ర విరుద్ధ మైన కార్య మేదీ లేదు. విద్వచ్ఛిఖామణి వైన నీ కింతమాత్రము తెలియదా?

సోమ నాథుడు

సోమనాథుడు విద్వాంసుల బానిస కాడు, శాస్త్రముల బానిస కాడు, ధనికుల బానిస కాడు. ఆయన కంతా ఒకటే. శ్మశానసంచారి కీ భోగ మెందుకు? కపాలమాలాలంకృతుని కీ వైభవ మెందుకు? భస్మప్రియుని కీదివ్యానులేపనా లెందుకు? నగరకోటలో వలెనే, స్థానేశ్వరములో వలెనే—

మ హా ం తు

ఏమి, నీకు పూర్తిగా మతి చెడిన ట్లున్నదే! నీవుకూడా

చండాల హారదత్తునివలె మ్లేచ్ఛమతములో చేరినావా ఏమి? [సభలో హాహా కారములు] అక్కడ దుర్మార్గుడైన మ్లేచ్ఛుడు అదృష్టవశముచేత జయశాలి ఐ దేవసహితముగా దేవాలయ ధ్వంసము చేసినమాట నిజమే.

సోమ నాథుడు

మ్లేచ్ఛునికి దేవధ్వంసము చేయతరము కాదు. భక్తులే తమ ఈశ్వరుణ్ణి మరచిపోయి ధ్వంసము చేసుకుంటారు. శత్రువుకు విరోధించి నిర్వహించ సాధ్యము కానిది, మిత్రుడు ప్రేమతో సుతి సూత్రముగా నిర్వర్తిస్తాడు. ఇక్కడా అంతే కాబోతున్నది. [హాహాకారములు సభలో ప్రబల మవుతవి.]

మ హం తు

సోమనాథా, అంత కంతకు విచ్చల విడిగా మాట్లాడు తున్నావు. ఇట్లా ప్రేలి మహాపాపము కట్టుకో వద్దు!

సోమ నాథుడు

అవును, ప్రేలుతున్నాను, వాగుతున్నాను. మీ ఇష్టము వచ్చినట్టు నన్ను దూషించండి; కాని నామాటలు వినండి. ఈ స్థూలరూప పూజచేత ఈశ్వరుణ్ణి మీరు పూర్తిగా మరచి పోయినారు. ఇంతటితోనైనా మీరు తెలివి తెచ్చుకోకపోతే ఈశ్వరుడే తన విగ్రహ ధ్వంస మిచ్చయించి మీకు తనను జ్ఞాపకము చేసుకుంటాడు.

అంతా

[ఒక్కసారిగా] విగ్రహ ధ్వంసమా!

ఆరవ అర్చకుడు

[పక్కవానితో నెమ్మదిగా] సోమనాథుని కిక గోమాంసము తినడమే కొదవగా ఉన్నది!

సోమ నాథుడు

[నిశ్చలముగా] అవును, విగ్రహధ్వంసమే! భక్తులు తన విగ్రహపూజచేత తననే ధ్వంసముచేస్తూఉంటే, ఈశ్వరుడుశత్రువులలోచేరి తన విగ్రహధ్వంసముచేయించుకొని నిజస్వరూపము భక్తులకు చూపుతాడు. [అంతా చెవులు మూసుకుంటారు.]

మ హం తు

హర హరా! మే మీ మాటలు విన లేము!

రెండవ అర్చకుడు

[వినపడీ వినపడకుండా] సోమనాథుని ఈనూతన సిద్ధాంతము బౌద్ధ జైన సిద్ధాంతములనుకూడా తల దన్ని పోయినదే!

సోమ నాథుడు

ఈశ్వరుడు మ్లేచ్ఛపక్షము చేరినాడా, అతని ముందు మీ సేన లన్నీ డేగఎదుట పిచ్చుకవలె భూమికి పడిపోతవి!

మ హం తు

శివ శివ! మే మీకిరాతకపు మాటలు విన లేము! ఇట్టి వాక్కు లుచ్చరించి ఎట్టిశిక్షకు పాత్రుడ వైనావో నీకు తెలుసు ననుకుంటాను.

ఆరవ అర్చకుడు

[వినబడీ వినబడకుండా] సోమనాథుని ఉపమానాలుకూడా తగినట్లు కిరాతులవే వస్తున్నవి.

సోమనాథుడు

కాని నామాటలు విననందుకూ మీరు అజ్ఞానంవల్ల చేస్తున్న కిరాతకకృత్యానికీ పశ్చాత్తాపపడే సమయము రాక పోదు. సోమనాథుడుప్రళయతాండవము చేసేటప్పుడైనా మీకీమాటలు జ్ఞాపకము రాక పోవు. మీరు వినకపోతే ప్రజలైనా వింటా రేమో చూస్తాను! [మాట్లాడుతూనే అకస్మాత్తుగా నిష్క్ర మించును. సభ్యు లంతా నిశ్చేష్టులై నిమేషమాత్రము నిర్వా క్కులుగా ఉంటారు.]

మూడవ అర్చకుడు

[గద్గద స్వరముతో] సోమనాథుని మాటలకు నా ఒళ్ళు వణుకుతున్నది!

ఏడవ అర్చకుడు

నాకు దేహాన చెమటలు పోస్తున్నవి.

ఐదవ అర్చకుడు

సోమనాథుని స్వరము చూడగా అతని మాటలు ఈశ్వరుడు పూనిన వాని మాటలులాగా ఉన్నవి.

రెండవ అర్చకుడు

అయ్యలారా, ఇది భయపడే సమయము కాదు.

ఆరవ అర్చకుడు

ప్రస్తుత మా ఉన్మత్తుని మాటలకు వెరవక కర్తవ్య మాలో చించ వలసి ఉన్నది. అతని నోరు కట్టిపెట్టే ఉపాయ మేమిటి? ఈమాటలకే జడిసేయెడల మన జడుపు కిక అంత ముండదు,

సోమనాథుని కృపవల్ల ఈ కోట ఉన్నంత వరకు లక్షమంది మ్లేచ్ఛులు వచ్చినా మన సోమేశ్వరుణ్ణి రక్షించుకో గలము.

నాల్గవ అర్చకుడు

సోమనాథుని మాటలలో కూడా కొంత సత్య మున్న ట్లున్నది. అతను వట్టివాడు కాడు, భక్తుడు.

మ హం తు

అందువల్లనే నాకొకటి తోస్తున్నది. ఈశ్వరునికి ఈపూజతో తృప్తి కలగలేదు. సోమనాథుడు ఆవేశములో చెప్పుతున్నాడే కాని ఈశ్వరుని అసంతుష్టి పూజ ఎక్కువై ఎన్నటికీ కానేరదు. ఈ సేవ చాలదు. కాబట్టి నిరపాయంగా ఉండగలందులకై ఈ ఆలయంలో నేటినుంచీ నిన్నటిసేవకు అన్నివిధాలా దశ గుణంగా సేవలు చేయించుదాము. ఇక కాకపోతే, సామాన్య యాత్రికు లంతా దేవదర్శనము చేసేవేళ ఇంకొక రెండు గడియ లెక్కువ చేతాము.

రెండవ అర్చకుడు

ఈ ఊహ దివ్యంగా ఉన్నది.

ఆరవ అర్చకుడు

బృహస్పతికి కూడా ఇంతకంటె గొప్ప బుద్ధి ఉండదు. [కొందరు సంపూర్ణామోదమూ కొందరు అర్ధాంగీకారమూ తమ ముఖాలలో రకరకాలుగా చూపుతారు.]

మ హం తు

సభవారి కిది అంగీకారమే అనుకుంటాను.—ఎవ రాసంభ్ర మంగా వచ్చేది ?

భ టు డు

వార్తాహరుడు !

ఒకటవ అర్చకుడు

[ప్రక్కవానితో నెమ్మదిగా] సోమనాథుని మాటలు భయము కలిగించడము లేదా ?

వార్తా హరుడు

[ప్రవేశించి] స్వామీ, మ్లేచ్ఛుడు అజమీరు ముట్టడించి విశాలదేవుని సంహరించినాడు.

మ హం తు

ఏ మది! గజినీ ఏనా ? నిరుడు అనంగపాలుడు చేసిన పరాభవము చాలక మళ్ళీ తల ఎత్తినాడా? అజమీరు పట్టుబడ్డదా?

వార్తా హరుడు

లేదు. విశాలదేవ మహారాజు చనిపోయి నప్పటికీ ఆయన కుమారులు కోట సురక్షితముగా ఉంచినారు. లాభము లేదని ముట్టడి విడిచి గజినీ బయలుదేరినాడు.

మ హం తు

ఇప్పు డా చోరకిరాతుడు ఏ వైపుగా వెళ్ళుతున్నాడు ?

వార్తా హరుడు

ఇటువైపే వస్తున్నట్లు తోస్తున్నది. మహామారివలె అతను అడుగు పెట్టిన చోట నల్లా భస్మము చేసుకుంటూ వస్తున్నాడు. ఆకస్మికముగా వచ్చి పడి సోమనాథ దేవాలయము దోచుకొని పోవలెనని అతని ఉద్దేశ మంటున్నారు.

మ హ ం తు

అతని తరము కాదు ! అతని వెంట సుమారు ఎంత సైన్య మున్నది ?

వార్తా హారుడు

ఆశ్వికులు ముప్పదివేలు ఉంటారు. ఒంటెలూ అంతే ఉంటవి. కాల్బలము లేదు. అందువల్లనే రేపే సేన లిక్కడికి చేరుకోవచ్చు నని తోస్తున్నది.

మ హ ం తు

ఈశ్వరేచ్ఛ ! ఇంకా వార్తలు ?

వార్తా హారుడు

గజినీ రాక విని చాముండా మహారాజు పది వేల కాల్బలముతో అన్హిలపురము విడిచి ఘూర్జర రాజ్యలక్ష్మిని మ్లేచ్ఛునికి పాదాక్రాంతను చేసినాడు! కొందరు పారిపోయినా డంటున్నారు. సోమనాథ రక్షణార్థము వస్తున్నా డని మరికొందరంటున్నారు.

మ హ ం తు

మంచిది ! [వార్తాహారుడు నిష్క్రమించును.]

ఇది వితర్కములకు సమయము కాదు. మన మిప్పుడు కార్యశూరులము కావలెను. ఎవరి మనస్సులలో నైనా దేవాలయనిర్మూలనము విషయముగాని, యథాస్థానంలో సోమనాథ ప్రతిష్ఠచేసే విషయము గాని ఇంకా సందేహాలు నక్కి ఉన్నట్లయితే, అవి ఈ ఘోరవార్తతో శిథిల మైపోయి ఉంటవి.

సభ్యులు

అవును, అవును.

మహంతు

ఇప్పుడు దేవాలయంలో యాభై వేల సైన్యానికి ఆరునెలలకు సరిపోయే వస్తుసామగ్రి ఉన్నది. తక్షణము గోపురద్వారాలు మూయించుదాము. కందకాలలోకి సముద్రుణ్ణి ప్రవేశపెట్టుదాము. స్వామివారి సైన్యములు కాల్బలము ఐదువేలూ, రౌతులు ఐదువేలూ, వేయి గజాలూ ఉన్నవి. ఇంకా మన కిప్పుడు సహాయపడ గలసేన లేమున్నవో ఎవరికైనా సరిగా తెలుసునా ?

ఆరవ అర్చకుడు

ఉజ్జయినీ రాజపుత్రుడు ఐదువేల భటులతో ఇక్కడనే ఉన్నాడు. గాంధారసైనికులు వేయిమంది ఉన్నారు. తోమర కాళచూరి ఛాండిల రాజపురుషుల పరివారాలే ఐదువేలున్నవి.

రెండవ అర్చకుడు

ఇక వంగ కళింగ ఆంధ్ర చోళ కేరళ పాండ్యదేశములనుంచి వచ్చిన క్షత్రియుల పరివారాలే ఐదారువేలు కావచ్చును.

మూడవ అర్చకుడు

ఇంకా చిన్న చిన్న రాజపుత్రనాయకులు ఉండరా! ఇంకా సాయం చేయ గలవారి నందరినీ సోమనాథరక్షణకు పూనుకో మందాము.

రెండవ అర్చకుడు

ఇంకా చాముండా మహారాజు పదివేలకాల్బలముతో రావ

చ్చును గదా! ఈ దేవాలయపు కోటలో ఉండి ఈ సేనలతో పదిమంది గజినీలను కూడా ధిక్కరించ వచ్చును.

ఆరవ అర్చకుడు

కోట వెడలి మ్లేచ్ఛాధమున్ని పారదోలడానికి మాత్ర మీ సైన్యము చాలదా? అందులో శత్రుసైన్యము ప్రయాణము చేసి బడలి ఉంటుంది కూడాను.

మహంతు

మనము తొందరపడ రాదు. ఇంత ఆకస్మికముగా అంత బలముతో వచ్చిన శత్రువునుండి మన దేవాలయము కాపాడు కుంటే చాలును. నెమ్మదిగా ఇతర రాజులకు వార్త లంప వచ్చును.

మూడవ అర్చకుడు

అవసరమైతే ఈపవిత్ర క్షేత్ర రక్షణార్థము బ్రాహ్మణులము కూడా పూనుకుందాము. జయ సోమనాథ!

నాల్గవ అర్చకుడు

ఇవి గంటమూ తాళపత్రములూ పట్టడములో ఆరితేరిన చేతు లైనప్పటికీ, సోమనాథుని దయవల్ల డాలూ కత్తీకూడా పట్ట నేర్చినవి.

మహంతు

సంతోషమే, కాని మనకంత అవసర ముండదు. మీదు మిక్కిలి సోమనాథస్వామి బలముమీద మన మాధార పడ వచ్చును. శారదాపీఠము జయించ వలె నని కాశ్మీర మీా మ్లేచ్ఛుడు రెండుసార్లు దండెత్తిమాత్ర మేమి చేయగలిగినాడు?

రెండవ అర్చకుడు

దేవాలయము ధ్వజస్తంభముమీద యుద్ధసూచకముగా రక్తధ్వజ మెత్తించవలెను!

వార్తాహరుడు

[ఇంకొకడు వేగముగా ప్రవేశించి] రాజధాని విడిచి సోమనాథ రక్షణార్థము చాముండా మహారాజు పదివేల కాల్బలముతో వస్తున్నాడు. మ్లేచ్ఛసైన్యములు దారుణ వేగముతో వస్తున్నవి.

['జయీ భవ సోమనాథ!' శబ్దములతో అందరూ నిలుచుందురు.]

## మూడవ రంగము

[దేవాలయమును ముట్టడించిన మహమ్మదీయ సేనలు వెను దీస్తున్నవి. కోటగోడలమీదనుంచి భారతీయుల జయశబ్దములు వినబడుతున్నవి. కోటనుంచి వెనుకకు తిరిగి పోతూ నలుగురు మహమ్మదీయభటులు ప్రవేశింతురు.]

ఒకటవ భటుడు

ఇక్కడ నుంటే మన కిక మరణము తప్పదు.

రెండవ భటుడు

ఈ సైతాను రాతికి ఇంత శక్తి ఎక్కడిది!

మూడవ భటుడు

అల్లా మనను పరీక్ష చేస్తున్నాడు.

నాల్గవ భటుడు

సుల్తాన్ ఘాజీవద్దకు పూజారి వచ్చి 'మి మ్మందరినీ సోమ నాథుడు చంపుతా' డని బెదరించినాడు.

రెండవ భటుడు

ఆమాటలకు కోపంతో వేసినవాళ్ళ బాణాలలో నా బాణం తోనే వాడు మళ్ళీ వెనక్కు తిరిగి చూడకుండా పారిపోయినాడు.

ఒకటవ భటుడు

కాని ఆ పూజారి మాటలే నిజ మయ్యే ట్లున్నవి.

నాల్గవ భటుడు

ఈ బ్రాహ్మణు లంతా సైతానుతో సంధి చేసుకొన్నారు. సైతాను అల్లాతోనే పోట్లాడుతాడు. సైతానుతో మన మేమి గెలుస్తాము!

మూడవ భటుడు

మనకు శత్రువులతో కలిసిన సైతానువల్ల భయం లేదు. సైతాను మనలోనే ఉన్నాడు. మనం వాడికి భయపడవలె!

అందరూ

అల్లా!

మూడవ భటుడు

డబ్బంతా సైతాను. ఇస్లాము మతము స్థాపించడానికి మనము పోట్లాడవలె! గురు మహమ్మదు బోధలకోసము పోట్లాడవలె! అప్పుడే అల్లా మనకు సహాయం చేస్తాడు.

నాల్గవ భటుడు

అల్లా మనకు సహాయం చేస్తాడు.

మూడవ భటుడు

మన మిక్కడ డబ్బు కొల్లగొట్టుదా మని వచ్చినాము. ఈ దేవాలయంలో బంగారపు కుప్ప లున్న వని ఆశతో వచ్చినాము. మతస్థాపనకు రాలేదు. అల్లా మనకు సహాయం చేయడు.

రెండవ భటుడు

అల్లా మనకు సహాయం చేయడు.

మూడవ భటుడు

మనస్సుకు విశ్రాంతి ఇస్తుం దనే వంక పెట్టుకొని సురాపానము చేసే మనమీాద అల్లా కోపించి కాఫర్లవైపు చేరినాడు.

ఒకటవ భటుడు

అల్లా కోపించి కాఫర్లవైపు చేరినాడు!

రెండవ భటుడు

అల్లా దయ లేనిది రుస్తు మైతేమాత్ర మేం జేస్తాము ?
[ముందువైపు చూచి] అల్లా !

నాల్గవ భటుడు

[అటువైపే చూచి] అల్లా! అమీన్ ఉల్ మిల్లాత్ !
[ఆవైపునుంచి సుల్తాను ఘాజీ మహమ్మదు గజ్నవీ ఇద్దరు అనుచరులతో ప్రవేశించును. ముగ్గురూ యుద్ధపు దుస్తులతో ఉన్నారు. సుల్తాన్ గజ్నవీ మనోహర రూపుడు, అత్యున్నత దేహుడు. అతను రాగానే నలుగురు భటులూ పక్కకు ఒదిగి నిలుచుండి సంభాషణ సాగినతర్వాత నెమ్మదిగా కనబడీ కనబడకుండగా వంగి వంగి సలాములు చేస్తూ జారిపోతారు.]

గజ్నవీ

ఏమి టీవిప్లవము !

ఒకటవ అనుచరుడు

సిగ్గు లేకుండా ముసల్మానులు కాఫర్ల ఎదుట నిలువలేక వెనుక తగ్గుతున్నారు.

రెండవ అనుచరుడు

గాలికి కొట్టుకొని పోయే ధూళి రేణువులవలె ఘాజీవాడికి చెల్లాచెద రయ్యే కాఫర్లు ఇప్పుడు చూపే ఉత్సాహము అర్థము కాకున్నది. వీళ్ళు ఆకలిగొన్న తోడేళ్ళవలె పోట్లాడుతున్నారు.

గజ్నవీ

మనము పోయిన సంవత్సరము అనంగపాలునితో యుద్ధము నుండి తొలగిపోవడము ఓడిపోవడ మనుకుంటున్నారు. అదంతా

తమ విగ్రహామహాత్మ్య మని తలుస్తున్నారు కాబోలు! ఇంకా వాళ్ళు బత్తికణశక్తి ఎరగరు. బడలి ఉన్న సేనలతో యుద్ధము చేయడానికి మే మిష్టపడ లే మని వా ళ్ళెరగరు.

ఒకటవ అనుచరుడు

కాఫర్లు!

రెండవ అనుచరుడు

[సైనికులవంక తిరిగి] అట్లా పారిపోతారేమి ? సిగ్గు లేదా ? ఇస్లాము జ్ఞాపకం లేదా ? మన గురువుఆజ్ఞ మరచిపోయినారా? పారిపోయే వాళ్ళను అల్లా శిక్షిస్తాడు.

ఒకటవ అనుచరుడు

పారిపోయిన వాళ్ళను సైతాను పట్టుకుంటాడు. గంధకపు మంటలో వేసి బొగ్గు కాకుండా నూనెతో తడుపుతాడు! అమీన్ ఉల్ మిల్లాత్ మీకు ఇస్తున్న ఆజ్ఞ వినండి!

రెండవ అనుచరుడు

నరకానికి కూడా భయపడరా! ఆలీకంటె ధర్మాత్ము డైన సుల్తానును ఇట్లా విడిచి వెళ్ళుతారా ?

గజ్నవీ

బాబులారా, మీకు వృథాశ్రమ వద్దు, లాభము లేదు. వాళ్లు వినే స్థితిలో లేరు.

రెండవ అనుచరుడు

అల్లా! [కోటలోనుండి జయధ్వానులు వినవచ్చును.]

ఒకటవ అనుచరుడు

[కోపముతో కోటవైపు చూచి పళ్ళు కొరుకుతూ] కాఫర్లు!

గజ్నవీ

అల్లా హో అక్బర్ ! [అని అకస్మాత్తుగా బిగ్గరగా అరచి మోకరించి వంగి, భూమిమీద శిరస్సు మోపి, చేతులు రెండూ కలిపి నిశ్శబ్దముగా ప్రార్థన చేస్తున్నాడు. అతను మక్కావైపు తిరిగినాడు. ఆవైపుగానే సోమనాథస్వామి ఆలయమూ లింగమూ ఉన్నవి. అతని అనుచరులుకూడా భక్తితో తలలు వంచుతారు. మహమ్మదీయులవైపు నిశ్శబ్దము. కాని కోటనుంచి ధ్వనులు వస్తున్నవి.]

కోటలోనుంచి ధ్వనులు

జయ సోమనాథ, జయ సోమనాథ !

మ్లేచ్ఛుణ్ణి చంపండి! [బాణవర్షము, గజ్నవీచుట్టూ పడును.]

కోటనుంచి సోమనాథుని గొంతు

వద్దు! వద్దు! సోమనాథుణ్ణి ధ్యానం చేస్తూ ఉన్న మ్లేచ్ఛుణ్ణి కూడా చంపరాదు. అయ్యో! ఇక సోమనాథస్వామి మ్లేచ్ఛుని వశ మౌతాడు.

కోటనుంచి వృద్ధురాలి గొంతు

సోమనాథస్వామి భక్తశరణ్యుడు! [బాణవర్ష మాగిపోయినది. ఇంతలో సుల్తాను గజ్నవీ లేచినాడు. అతని మనోహరమైన కళ్ళలో దివ్యతేజస్సు ప్రకాశిస్తున్నది. అతని రూపము దివ్యపురుషుని దానివలె కనపడగా అనుచరులు మరింత గౌరవ భావముతో పక్కకు తొలగి నిలుచుంటారు.]

గజ్నవీ

[నెమ్మదిగా, స్పష్టముగా, బిగ్గరగా, సగౌరవంగా, ఉదాత్త

స్వరముతో] అల్లా ఆజ్ఞ ఐనది! మన కిక జయము తప్పదు!

అ ను చ రు లు

అల్లా హో అక్బర్!

గ జ్నీ

మీ రంతా విడిచి పోయినా ఘాజీ ఒక్కడే కాఫర్ల నందరినీ జయించగలడు!

అ ను చ రు లు

[ఉద్రేకముతో] జయ బత్షికన్! ఘాజీ, సైఫ్ అద్దౌలా, యానిన్ అద్దౌలా, అమీన్ ఉల్ మిల్లాత్, అమీర్, మహమ్మదు గజ్నవీ సుల్తాన్ జయ! [ముసల్మాను భటులు నలుగురూ మళ్ళీ కోటవైపుకు ఉత్సాహముతో మళ్ళుతారు. తెర పడేటప్పటికి జయ జయ సోమనాథ! శబ్దములు, దీన్ దీన్ ధ్వనులలో మునిగి అణగిపోతవి.]

---

# నాలుగవ రంగము

[దేవాలయములోపల నిలుచుండి మహాంతూ ఇద్దరర్చకులూ సంభాషిస్తున్నారు.]

మహాంతు

ఈ మ్లేచ్ఛసైనికులు సామాన్యులు కారు.

ఒకటవ అర్చకుడు

అబ్బా, వాళ్ళు దుర్ధర్షులు. వాళ్ళ దేహాల చక్కదన మేమి!

రెండవ అర్చకుడు

పసినిమ్మపండునంటి శరీరచ్ఛాయ! ఎంత దీర్ఘకాయులు! వాళ్ల బాణప్రయోగ మత్యద్భుతముగా ఉన్నది. [మహాంతువైపు తిరిగి] తమరుకూడా యుద్ధము ఆలోకిస్తున్నారా?

మహాంతు

మేము కూడా చూస్తూనే ఉన్నాము. మన భటుల చాతుర్యము కూడా ప్రశంసార్హముగా ఉన్నది. శత్రువుల పచ్చదనము చూచి వాళ్ళు నల్లనివాళ్ళు కారని భయపడి పారిపోయేందుకు మన భటులు చౌద్ రాయి వంటి వాళ్ళు కారు! [అర్చకులు నవ్వుకుంటారు.]

రెండవ అర్చకుడు

అందులో గాంధారవీరుల గభీరపరాక్రమము అగ్రగణ్యము.

మహాంతు

అవును, వాళ్ళు అసంగపాలునివద్ద అభ్యసించినవారాయె!

కాని ఒకరి కండగా రెండవవా డుండి వంగసైనికులు చూపు తున్న అన్యోన్య సోదరభావము ఎంత చిత్రముగా ఉన్నదో చూచినారా?

ఒకటవ అర్చకుడు

అన్నిటికంటె ఆంధ్రవీరుల పౌరుషప్రదర్శనము ఉల్లాసకర ముగా ఉన్నది.

మ హం తు

[చిరునవ్వుతో] అవును, వాళ్ళ బాహుపరాక్రమమూ వాక్ప్రతాపమూ ఒకదాని కొకటి తీసిపోవు! [ముగ్గురూ పక పక నవ్వుకుంటారు.

రెండవ అర్చకుడు

తెలి వంటే తెలివి ఆచోళదేశ భటులది. వాళ్ళ నోరెత్తి మాట్లాడితే బుడబుడ ధ్వని పుట్టుతుంది.

మ హం తు

కాదు కాదు. రెండవ వేదానికి తల్లి ఐన ద్రావిడభాష నట్లా హాస్య మాడరాదు.

ఒకటవ అర్చకుడు

మనకు నేడు జయము తప్పదు.

మ హం తు

[వికసించిన ముఖముతో] ఏమో, సోమనాథస్వామివారి కటాక్షము!

భ టు డు

[ప్రవేశించి] జయీ భవ సోమనాథ! దేవరా, మహాత్మ

దీయ సైన్యములు వెను దిరుగుతున్నవి. [అంతా సంతోషము వెలిపుత్తురు. భటుడు నిష్క్రమించ బోతూ ఉండగా మహంతు అతని కొక సువర్ణపుష్పము పారితోషిక మిచ్చును. భటుడు వందనము చేసి స్వీకరించి నిష్క్రమించును.]

మ హం తు

[ప్రఫుల్ల నేత్రములతో] మన భయము తీరినది.

ఒకటవ అర్చకుడు

పిచ్చిసోమనాథుని కేకలవల్ల కలిగిన హృదయాందోళనము చల్లారినది.

రెండవ అర్చకుడు

కాస్తవిశ్రాంతి తీసుకుందాము. [జయ సోమనాథ! అంటూ ముగ్గురూ కూర్చుంటారు. సోమనాథుడు ప్రవేశించును.]

సోమ నాథుడు

నామాటలు నిజ మయ్యే సమయము వచ్చినది!

మ హం తు

దుష్టుడా, ఏమి టామాటలు!

సోమ నాథుడు

ఈ దేవాలయమును సోమనాథుడు నిర్మూలించబోతున్నాడు.

మ హం తు

[కోపముతో] నీకు మతి భ్రమించిన దని జాలి తలచక పోతే నీవిప్పు డన్నమాటలకు నీజిహ్వ ఛేదించవలె!

ఒకటవ అర్చకుడు

సోమనాథా!నీ కేమి టీవెఱ్ఱి!

రెండవ అర్చకుడు

మ్లేచ్ఛులు ఓడిపోవడము నీకళ్ళకు మంటగా ఉన్నదా?

సోమ నాథుడు

అన్నలారా, మీ కీకోప మెందుకు? ఇప్పుడు మ్లేచ్ఛులపక్షు మైనాడు సోమనాథస్వామి. మొదట వాళ్ళు పారిపోయినమాట నిజమే.

మ హా ం తు

[భయముతోనూ కోపముతోనూ] అయితే ఇప్పుడు?

సోమ నాథుడు

ఆ శబ్దము వినండి! [దీన్! దీన్! అని ముసల్మానుల కేకలూ, మధ్య మధ్య ఆలయపుగోడలనుంచి ఆర్తనాదములూ విన వస్తున్నవి.]

మ హా ం తు

[తొట్రుపాటుతో] ఏమి టది!

ఒకటవ అర్చకుడు

నేను పోయి చూచి వస్తాను. [నిష్క్రమించును.]

సోమ నాథుడు

మొదట మ్లేచ్ఛులే పారిపోతున్నారు. కాని అప్పుడు వాళ్ళ ప్రభువు సోమనాథునికి ఎదురుగా సాష్టాంగ దండ ప్రణామము చేసి తదేక ధ్యానముతో ప్రార్థించినాడు.

రెండవ అర్చకుడు

ఏమి! ఆ మ్లేచ్ఛప్రభువే సోమనాథేశ్వరునికి దాసు డైనాడా?

మ హం తు

ఐతే ఈ యుద్ధపు కేక లేమిటి?

సోమ నాథుడు

అది ఈశ్వరేచ్ఛ! భక్తపరాధీనుడు మ్లేచ్ఛుల వశ మైనాడు. వాళ్ళకే జయ మిస్తా నని వాగ్దత్తము చేసినాడు.

మ హం తు

నీ ఉన్మత్త ప్రలాపాలు చాలించు. దేవాలయధ్వంసి అనీ విగ్రహధ్వంసి అనీ పేరు పడ్డ ఈ గోహంతకు సోమనాథస్వామి వశుడైనాడా?

సోమ నాథుడు

అవును. భక్తులు తనకు స్వేచ్ఛాభంగము కలిగించినప్పుడు తన దేవాలయ ధ్వంసము కోసమూ విగ్రహధ్వంసముకోసమూ స్వామి మ్లేచ్ఛులను ఆశ్రయించినాడు.

మ హం తు

ఛీ, నీ నోటికి అడ్డు లేకున్నది!

రెండవ అర్చకుడు

ఏవో నాలుగుమాటల లెక్కలు కట్టుకొని వినుగు లేకుండా వాగుతున్నావు. [ఒకటవ అర్చకుడు ప్రవేశించును.]

మ హం తు

[ఆతురతతో] ఏమిటి విశేషాలు?

ఒకటవ అర్చకుడు

నిజమే. మ్లేచ్ఛులు పారిపోతుండగా మనసైనికులు కోట గోడ విడిచి వాళ్ళమీద పడడానికి ఉద్యుక్తు లవుతున్నారు.

అంతలోనే మార్పు జరిగినది. యుద్ధరంగములో నిర్భయముగా గజనీ సాష్టాంగపడి సోమనాథుని ప్రార్థించినాడు. అప్పుడతని మీద మన సైనికులు కురిపించిన బాణవర్షము పూలవానవలె ఐపోయినది. మళ్ళీ మ్లేచ్ఛుడు లేచేటప్పటికి అతను దివ్య పురుషునివలె కనబడ్డాడు.

మ హ ం తు

మ్లేచ్ఛుడు దివ్య పురుషునివలె కనబడ్డాడా?

రెండవ అర్చకుడు

మ్లేచ్ఛుడే?

ఒకటవ అర్చకుడు

అవు నవును. ఈ సాయంకాలమం దతను మధ్యందిన మార్తాండునివలె వెలుగుతున్నాడు. పారిపోతున్న మ్లేచ్ఛసేనలు వెనుకకు మళ్ళినవి. వాళ్ళ కందరికీ నూతనోత్సాహము కలిగినది. వా ళ్ళిప్పుడు మానవాతీతులుగా కనబడుతున్నారు.

రెండవ అర్చకుడు

ఇ దంతా ఏమో వింతగా ఉన్నదే.

ఒకటవ అర్చకుడు

వాళ్ళ శక్తి దైవశక్తిగా కనబడుతున్నది. దుర్ధర్షులైనారు. వాళ్ళధాటికి మనసేనలు ఆగలేకున్నవి. మనసైనికులు నీరసులుగా కనబడు తున్నారు.

మ హ ం తు

ఇ దంతా ఏమో పీడకలలాగా ఉన్నది.

రెండవ అర్చకుడు

పోయి చూచి వస్తాను. [నిష్క్రమించును.]

ఒకటవ అర్చకుడు

మన కిక జయము లభించడము కష్టతరము. ఆంధ్ర వీరులు కూడా నోట ఒక్కవాక్యైనా ఉచ్చరించడములేదు. చోళులు పక్కకు ఒదుగు తున్నారు. ఒక్క గాంధార సైనికులే యుద్ధ భారము వహిస్తున్నారు. వాళ్ళ సంఖ్యకూడా నెమ్మదిగా క్షీణి స్తున్నది. వాళ్ళు వెనుకంజ వేసిన క్షణమే దేవాలయము మ్లేచ్ఛులవశ మవుతుంది.

మ హ ం తు

[ముఖాన నెత్తురుబొట్టు లేక] దేవాలయంలోని ధనరాసు లన్నీ సురంగంగుండా అవతలికి చేర్పించు. నీ లయిన దల్లా తీయించేట్లు చూడవలె! [ఒకటవ అర్చకుడు నిష్క్రమించును.]

సోమనాథుడు

[ఇంతవరకూ మౌనముగానూ గంభీరముగానూ ఉన్నాడు] ఇప్పుడైనా నామాటలు వినరాదా ?

మ హ ం తు

[ఆందోళనముతో] ఈ సమయంలో నీవు గోల పెట్టకు! నీ కోరికే ఫలిస్తుందేమో !

సోమనాథుడు

స్వామీ! అంత కోపము వద్దు. స్వామి లింగము మీద నైనా దయ లేదా ?

మ హం తు

ఛీ! దుర్మార్గుడా! నీవు మొదటినుంచీ శకునపక్షిలాగా పోగైనావు! నీ తిట్లే సఫల మవుతున్నవి.

భ టు డు

[ప్రవేశించి] ద్వారములవద్ద యుద్ధము భయంకరముగా ఉన్నది. గజినీ ప్రాగ్ద్వారమువద్ద ఉన్నాడు. అది కొద్దిసేపటిలో భగ్న మయ్యే ట్లున్నది. [నిష్క్రమించును.]

మ హం తు

[కళ్ళు మూసుకొని] అయ్యో! సోమనాథస్వామీ! భక్తుల మీద దయ లేదా? మాప్రయత్నా లన్నీ వ్యర్థము చేస్తావా? ఒక్క సంవత్సరకాలములోనే భరతవర్ష మంతా వ్యాపించిన నీకీర్తి ఇంతటితోనే అడుగంటవలెనా? కాశీవిశ్వనాథునికంటె నీ దేవాలయము భువన ప్రశస్తి కలదానిగ చేయదలచుకున్నానే! నాఉద్దేశా లన్నీ ఇట్లా మూలచ్ఛేదము చేయదలచుకున్నావా!

సోమ నాథుడు

[జాలితో అర్ధనిమీలిత నేత్రములతో] అయ్యో! పిచ్చి భక్తుడా!

మ హం తు

[తల ఎత్తి] ఎవరది?

సోమనాథుడు

నేను, సోమనాథుణ్ణి.

మ హం తు

నీవా! మా అనర్థకమవు.

భటుడు

[ప్రవేశించి] ప్రాగ్ద్వారము పగిలిపోయినది. ద్వారములో నుండి మ్లేచ్ఛులను రానీయకుండా మనసైనికులు అడ్డగిస్తున్నారు. చీకటి పడకముందే కోట శత్రువులకు స్వాధీనము కావచ్చును. [నిష్క్రమించును.]

మహంతు

దుర్వార్తపైన దుర్వార్త! స్వామీ! ఎంతలో ఎంత ఐనది! సూర్యభగవానుడా! ఒక్క గడియ ముందుగా అస్తమించి ఈ దేవాలయాన్ని రక్షించరాదా?

సోమనాథుడు

ఇప్పుడైనా స్వామి లింగము ఇక్కడనుంచి తీయించరాదా! ఇప్పటికైనా ఈశ్వరేచ్ఛ మీకు గోచరించడము లేదా?

మహంతు

ఓయీ దుర్ముఖా, నీముఖమునాకు కనబరచక అవతలికి పో!

సోమనాథుడు

[నమస్కరించి] వ్యర్థరౌద్రానికి ఇది వేళ కాదు. మనము గర్వించే సమయము దాటి పోయినది. శత్రువు ద్వారమువద్ద సింహామువలె గర్జిస్తున్నాడు. ఇప్పటికైనా సోమనాథుణ్ణి యథా స్థానంలో ప్రతిష్ఠించి తిరిగి మనకు ప్రసన్నుణ్ణి చేసుకోరాదా?

మహంతు

[కొంచెము శాంతముగా] శిల్పులు ఆలింగము ఆకాశంలో బంధించినారు. దేవాలయము నిర్మూలిస్తే కాని ఆలింగ మిప్పుడు కదల్చలేము.

సోమ నాథుడు

అయ్యో! అందువల్లనే సోమనాథస్వామి అట్లా పరితపించి నాడు! మనకు స్వామిలింగముకంటె దేవాలయ మెక్కువా?

మ హ ం తు

[కన్నీటి బొట్లు విడుస్తూ] కాని, చేతులారా ఇంతచక్కని దేవాలయము పడగొట్టించడ మెట్లా? ఇటువంటి దివ్యమందిరము ఈ లోకంలో నిర్మించడము మళ్ళీ మానవమాత్రులకు సాధ్య మవుతుందా, సోమనాథా!

భ టు డు

[ప్రవేశించి] మ్లేచ్ఛులు ఈశ్వర ధ్వజము విరిచివేసి అర్ధచంద్రుడు వెలుగుతున్న తమధ్వజముఎత్తినారు. ఈశ్వరధ్వజము ధూలిలో పొరలాడుతున్నది. [నిష్క్రమించును.]

మ హ ం తు

మ్లేచ్ఛులది అర్ధచంద్ర ధ్వజమా? అది సోమనాథుని చిహ్నమే గదా! ఇదంతా ఏదో కలగా ఉన్నది. ఏమి టీప్రచండ వాయువు!

సోమ నాథుడు

ముసల్మానులధ్వజమదుగో! చండవాయుతాడనచే భ్రమిస్తూ అది ఈ సంధ్యాకాలంలో ప్రలయతాండవముచేసే మహానటుని శిరస్సునలె కనిపిస్తున్నది. అయితే స్వామి లింగమును తీసి వేయడము విషయమేమిటి? నేను అంత్యక్షణముదాకా విడవ దలచుకో లేదు.

మ హ ం తు

[చేతులు వేలవేసి] సోమనాథా, నీమాటలు మొదటనే విన

వలసినది! మందిరనిర్మాణము తలలో దూరిన తర్వాత మరేమీ మనస్సు కెక్కలేదు. దుర్వ్యసనమువలె అది వృద్ధి పొందినది. ధర్మాధర్మ విచారణకూడా వదలినాను. ఇప్పుడింకేమున్నది? సోమనాథలింగముకూడా ఈ దేవాలయానికిబలిఇయ్యవలసినదే!

సోమ నాథుడు

అయ్యో!

మ హం తు

గర్వాతిశయంతో మిట్టిపడినంతసేపూ సోమనాథునికి తెచ్చి పెట్టుతున్న అపాయ మూహించ లేక పోయినాను. మ్లేచ్ఛులు కోటలో ప్రవేశించినారు! ఇప్పుడిక దేవాలయము పడగొట్టించే వ్యవధిమాత్రమేదీ?

సోమ నాథుడు

వ్యవధి ఉన్నంతసేపూ ఊరుకున్నాము.

మ హం తు

వ్యవధి ఉన్నంతసేపూ గెలవ గల మనే ఆశకూడా ఉన్నది. అంతసేపూ తన ధనరాసులు చూచి సంతోషించే లోభి సామెతగా ఉన్నాను ఇప్పుడంతా ఐపోయినది !

సోమ నాథుడు

అయితే సోమనాథధ్వంసమే సోమనాథుని విజయము! జయ సోమనాథ! [నిష్క్రమించును ]

భ టు డు

[వెంటనే ప్రవేశించి] ఉత్తరద్వారమూ పశ్చిమద్వారమూ కూడా పగిలిపోయినవి. మిడతల దండువలె మ్లేచ్ఛులు లోపల

ప్రవేశిస్తున్నారు. దేవాలయ ఆవరణంలో యుద్ధము జరుగుతున్నది. అడుగడుగుకూ క్షత్రియ యోధులు ప్రాణాలు బలి ఇస్తున్నారు. [నిష్క్రమించును.]

మ హా ం తు

దుర్వార్తపైన దుర్వార్త వస్తున్నది. ఈ దివ్య మందిరము పిశాచమువలె ఇంత పవిత్రరక్తము బలి కోరుతుందనుకోలేదు. నిన్ననే ఈశ్వరునికి అంతవైభవము చూచిన కళ్ళతో నేడీస్థితి చూడవలసి వచ్చినది. మానవుల చేతులలో చిక్కినతర్వాత మహేశ్వరుని సంపత్తుకు కూడా చాంచల్య మేర్పడినది.

ఒకటవ అర్చకుడు

[ప్రవేశించి] తీసి వేయగల అమూల్యవస్తువు లన్నీ తీసి వేయించి సురంగములోనే దాచి పదిలపరిచినాము. ఆబంగారవు గంటలూ రత్నాలు పొదిగిన వాహనాలూ తీయించ సాధ్యము కాలేదు. [నిష్క్రమించును.]

రెండవ అర్చకుడు

[వెంటనే ప్రవేశించి] ప్రాణాలమీద ఆశ ఉంటే మనము పారిపోవలె! సైనికులు చెల్లాచెదరైనారు. మ్లేచ్ఛులిటువైపే వస్తున్నారు. ఇంకా పడవల వద్దకు చేరుకొని తప్పించుకోవడానికి వ్యవధానమూ వీలూ ఉన్నవి.

మ హా ం తు

నేను పారిపోను. నాజీవితములో పెట్టుకున్న ఆదర్శము ఈ రీతిగా వికల మవుతున్నవి. చివరవరకూ సాధించి కాని ఊరు

కోను, [నిశ్చలముగా కూర్చుంటను. రెండవ అర్చకుడు ఉత్తర మీాయకుండగా నిష్క్రమించును.]

భ టు డు

[ప్రవేశించి] మన సైనికులు పారిపోతున్నారు. స్వామీ! కన్నీళ్ళు విడవ వద్దు.

మ హా ం తు

అవును. కన్నీళ్ళు విడవను. నే నిక శాంతము వదలను. నీవు కూడా పారిపోతావా?

భ టు డు

ప్రాణ ముండగా ఈ సేవకుడు స్వామిసన్నిధిని విడిచి పోడు!

మ హా ం తు

మంచిది. నీవు పోయి గర్భాలయంలో తప్ప ఆలయంలో ఎక్కడా దీప మనేది లేకుండా చేసి రా?

భ టు డు

చిత్తము. [నిష్క్రమించును. మహాంతు నిశ్చలముగా కూర్చుంటాడు. ముసల్మానుల దీన్ దీన్ శబ్దములతో దేవాలయము అదురుతూ ఉంటుంది. తెర పడుతుంది.]

---

# ఐదవ రంగము

[దేవాలయపు మెట్లెక్కుతూ అనుచరునితో భటునితో సుల్తాను మహమ్మదు గజ్నవీ ప్రవేశించును. అనుచరుడు చక్కని గంధ్రగొడ్డలిని గౌరవముతో తీసుకొని వస్తున్నాడు.]

గజ్నవీ

[ఆశ్చర్యముతో] ఏమి ఈ విగ్రహాపు ఐశ్వర్యము!

అనుచరుడు

అల్లా కంటె సైతానుకు ఐశ్వర్య మెక్కువ. స్వభావంలో లేని గుణాన్ని రూపంతో కప్పి పుచ్చవలె!

గజ్నవీ

పిరికి భటుడు అమూల్యమైన ఖడ్గము చేత ధరించినట్లు.

అనుచరుడు

అనాకారివాడు వెలగల దుస్తులు ధరించి ఎప్పుడూ అత్తరు వాసనలు గుప్పు గుప్పున చిమ్మేటట్లుగా ఉంటుంది ఈ వైభవము.

గజ్నవీ

ఇవంతా ఎంతచక్కగా చలవరాళ్ళతో తాపడం చేసినారు!

అనుచరుడు

పాపలు కనబడుతున్నవి. ఈ విగ్రహాన్ని ఆరాధించబోయే కాఫర్ల నీడ లీరాళ్ళలో ప్రతిబింబించి వాళ్ళను హేళన చేస్తూ ఉండేవి కాదు కాబోలు!

గజ్నవీ

ఎక్కడ అడుగు పెట్టితే అక్కడ మాసిపోయే ట్లున్నది. [అని నెమ్మదిగా అడుగులు పెట్టును. అనుచరుడు ముఖములో

అనిష్టభావము వెలిబుచ్చును. అనుచరుణ్ణి లెక్క చేయక] ఈమనోజ్ఞమందిరము కూడా నిర్మూలము చేయ వలసినదేనా! భీమనగరులో దొరకిన రజితగృహమువలె దీనిని మడిచి తీసు కొని పోయే వీలుంటే ఇది గజ్నవీ పట్టణానికి శోభాయ మానంగా ఉంటుందే

అనుచరుడు

అల్లా కోరికే ఆమహాత్ముని సేవకులకు ఆజ్ఞ. అల్లా వ్రాసిన లది శిరస్సున ధరించవలె.

గజ్నవీ

పక్కన ఆకోనేటిలో ఈ మందిరము అస్ఫుటంగా ప్రతిఫ లించి ఎంత అందంగాఉన్నది! ఇటువంటి కోనేళ్ళలోనే ప్యారీలు స్వర్గంలో స్నానాలు చేస్తారు. [దేవాలయ ద్వారముచేరినారు. లోప లంతా గాఢాంధకారము. చీకటిచూచి మొదట కాస్త అనుమానించి మళ్ళీ గజ్నవీ ఉపక్రమించ బోతున్నాడు.]

అనుచరుడు

సుల్తాన్, ఇప్పుడు చీకటి పడినది. శత్రువులు ఈ చీకటిలో నక్కి ఉన్నారేమో. జయము ఘాజీకి లభించినది గదా. రేపటిదాకా ఆగి పిమ్మట అమీన్ ఉల్ మిల్లాత్ లోపలికి వెళ్ళడము మంచిదేమో !

గజ్నవీ

నిజమే. కాని అల్లా ఆజ్ఞ తక్షణము నిర్వర్తించవలె. ఒక్క నిమిషముకూడా ఆగకుండా ఈ విగ్రహము పగలగొట్టవలె నని బత్తికఱకు ఉత్సాహముగా ఉన్నది.

అ ను చ రు డు

ఐతే కాగడాలు వెలిగించి భటులు తెచ్చేదాకా ఆగుదాము. ఒరే, కాగడాలు త్వరగా తీసుకు రండి. [కొంతమంది భటులు కాగడాలు తేవడానికి నిష్క్రమింతురు.]

గ జ్నవీ

కాగడాలు వాటితోవను అవి వస్తూ ఉంటవి. అవి వచ్చేదాకా ఉండే వీలు లేదు. ఈ అద్భుత దేవాలయము చూచిన కొద్దీ విగ్రహం చూచి బద్దలు చేయవలె నని తొందర ఎక్కువవుతున్నది.

అ ను చ రు డు

అయితే భటులను కొందరిని ముందు లోపలికి పంపుదాము. [భటులు ముందూ, వాళ్ళవెంట అనుచరునితో గజ్నవీ ఆలయంలో ప్రవేశిస్తారు.]

అ ను చ రు డు

ఈ కాఫర్లు తమ నిర్జీవపు దేవుడికి గోరీ కట్టినలాగా ఉన్నది.

గ జ్నవీ

కన్ను పొడుచుకుంటే కానరా కున్నది.

అ ను చ రు డు

ఈ విగ్రహాలను కొలిచే కాఫర్లు చచ్చిపోయినతర్వాత పోయే నరకద్వార మిట్లాగే ఉంటుంది.

గ జ్నవీ

అవును, కటిక చీకటిగా ఉన్నది. అర్చకులు దీపాలు ఆర్పి

వేసి పోయినారు. వాళ్ళ జయదేవతతోనే ఈ దేవాలయపు కాంతి దేవతకూడా పారిపోయినది.

అ ను చ రు డు

విగ్రహము ఉండే చోటికి దోప ఏదో తెలియడం లేదు.

భ టు లు

జాహాపనా, ఇటు, ఇటు. అటువైపునుంచి వెలుగు వస్తున్నది.

అ ను చ రు డు

జాగ్రత్తగానడవండి అక్కడ శత్రువులులేకుండా చూడండి. [దీపపు వెలుతురు వచ్చిన వైపుగా వెళ్ళి అంతా గర్భాలయము సమీపిస్తారు.]

చీకటిలో ఎవరో

గజనీ! గజనీ!

గ జ్నీ

ఎవ రంత స్వతంత్రించి పిలవ సాహసించేది?

అ ను చ రు డు

సైఫ్ అద్దౌలా ఘాజీని అట్లా పిలుస్తున్న ఆ కాఫరును చంపండి.

గ జ్నీ

తొందర వద్దు. [ధ్వనివంక తిరిగి] ఈ చీకటిలో దొంగవలె ఉండి న న్నెందుకు పిలిచినావు?

ధ్వ ని

నీ మేలుకోరే మిత్రుణ్ణి. చెప్పేమాటలు విను. ఇప్పటికే మా సోమనాథ స్వామికి కోపము వచ్చినది. ఇంతటితో నైనా

వెనక్కుపో! గర్భాలయంలోకి కూడా ప్రవేశించినావా, ఆపైన ఈశ్వరుడు భరించ లేడు. భస్మమై పోతావు. [అంతా నవ్వుతారు]

గ జ్న వీ

నా మిత్రుడా! నీవు నాకుకంటె నీవిగ్రహానికి మిత్రుడవుగా కనబడుతున్నావు!

ధ్వ ని

పశ్చాత్తాపపడి లాభ ముండదు.

గ జ్న వీ

నే నిప్పటికి తొమ్మిదివందల తొంభైతొమ్మిది దేవాలయాలలో ప్రవేశించి విగ్రహాలు నాశనము చేసి ఉన్నాను. దీనితో నా మొక్కు చెల్లిపోతుంది. నీవు చెప్పే పాఠము నాకు కొత్తది కాదు.

[అంతా నవ్వుతారు. గర్భాలయద్వారము చేరి గజ్నవీ ఆలయ మంతా పరీక్షిస్తున్నాడు. తొమ్మిది అడుగుల ఎత్తు గల సోమనాథలింగము ఆలయమధ్యమందు ఆకాశంలో ఆధారం లేకుండా నిలిచి ఉన్నట్లు ప్రక్కను వెలుగుతున్న అఖండపు దీపజ్వాల వెల్తురులో స్పష్టముగా కనబడుతుంది. పక్కనే ధ్యాన వ్యగ్రుడై ఉన్న మహంతు ఉదాత్తరూపము కానవస్తుంది.. గజ్నవీ ఆలింగము చూచి ఆశ్చర్యముతో ఒక అడుగు వెనక్కు వేస్తాడు.]

మ హం తు

[గంభీరముగా] ఎవరో వారు! లోపలికి రాకూడదు.

అ ను చ రు డు

[గజ్నవీకి గండ్రగొడ్డలి అందిస్తూ] కాఫర్! సుల్తాన్ ఘాజీ బత్‌షికన్ రాగూడ దనడానికి నీ వెవ్వడవు ?

గ జ్న వీ

ముందీ చందనపు కవాటము పదిలపరచండి. గజ్నవీలో మామందిరానికి పనికి వస్తుంది. [భటులా ప్రయత్నముమీదనే ఉంటారు.]

మ హం తు

[నిశ్చలముగా] ఎవ రైనా సరే, ఈ ఆలయంలో ప్రవేశించడానికి హక్కు లేదు.

గ జ్న వీ

[గండ్రగొడ్డలి అందుకుంటూ] అల్లా సేవకు డైన అమీన్ ఉల్ మిల్లత్ హక్కును కాదనగలవా డెవరు ? [అంటూ ఉద్రేకముతో లింగమును సమీపించి అల్లాహో అక్బర్! అంటూ కేక వేసి వెంటవెంటనే బలముకొద్దీ మూడుసార్లు గండ్రగొడ్డలితో లింగమును కొట్టును. చప్పుడవుతుందే కాని లింగము బీటుకూడా పారదు. గజ్నవీ నిర్విణ్ణుడై నిలుస్తాడు.]

మ హం తు

ఇంతటితో నైనా మాస్వామిమహత్త్వము తెలుసుకొని ఇక్కడనుంచి పారిపో! లేకపోతే నీప్రాణాలు దక్కవు. [ప్రయత్నము ముమ్మారు విఫలము కావడంచేత గజ్నవీకి ఉన్మాదము కలుగుతుంది. అనుచరుడూ భటులూ భయముతో వణుకుతారు. ఇంతలో 'దీన్ దీన్!' అంటూ భటులు కాగడాలు తీసికొని

వస్తారు. అప్పుడు తిరిగివచ్చిన ఉత్సాహముతో ఇక్కడిభటులూ అనుచరుడూ దీఁ దీఁ అని కేకలు వేస్తారు. ముసల్మాను భటులు కాగడాలు పట్టుకొని లింగముచుట్టూ నిలుచుంటారు.]

గజ్నవీ

ముందు మీ రే దేవాలయము ధ్వంసము చేయండి!

మహాంతు

మీరు చెడిపోతారు సుమా!

గజ్నవీ

[కోపముతో] నీవు నోరుమూసుకొని అవతల ఉండు!

[ఇంతలో భటులు దేవాలయపుగోడలు బ్రద్దలు కొట్టుతూ ఉంటారు. దక్షిణంవైపు గోడ కొంచెము సందిచ్చినది. వెంటనే అటువైపు లింగము ఒరుగుతుంది 'సైతాన్!' అని మహా సంతోషముతో ముసల్మాను భటులు అరుస్తారు.]

మహాంతు

[ఆపాదమస్తకము వణుకుతూ] గజనీ! ఇంతచక్కని దేవాలయము నాశనము చేసినావు! ఇంతటితో నీకు తృప్తి లేదా?

గజ్నవీ

ఈ విగ్రహము కూడా పగలగొట్టి నా మొక్కు తీర్చుకొని కాబావద్ద కానుకలు అర్పించవలె. అప్పుడే నాకు తృప్తి!

మహాంతు

బాగా ఆలోచించుకో! ఇంతటితో విడిచిపోతే నీకు కోటి సువర్ణాలూ లెక్కలేనన్ని రత్నాలూ ఇస్తాను.

గ జ్న వీ

[కొంచెము యోజించి] నేను నగరకోటలో ఏడులక్షల సువర్ణాలూ ఏడువందల మణుగుల వెండీ, రెండు వందల బంగారపు కడ్డీలూ లెక్కలేనన్ని మణులూ కొల్లగొట్టి తీసుకొని పోయినాను.

మ హం తు

అబ్బా! ఏమి ఈ మ్లేచ్ఛునిఆశ! ఇతను చనిపోయినా ఇతని కళ్ళు బంగారము కోసము వెదుకుతూ గుడ్లల్లో తిరుగుతూ ఉంటవి! దానికి పదిరెట్లు ధనమిస్తాను. ఇంకొకలింగ మెక్కడనైనా పగలగొట్టి నీమొక్కు తీర్చుకోవచ్చును. కాదు, నీకు నగర కోటలో దొరికిన దానికి నూరంతలు ఇస్తాను. ఇంతటితో దేవాలయము విడిచిపో! [గజనీ కొంచె మనుమానిస్తాడు. ఇంతలోకే గోడ ఉత్తరపైపుకూడా కొంతపడగా లింగము మరింత కుంగుతుంది. మహమ్మదీయులు ఆవేశంతో 'అల్లా ఆజ్ఞ దాట గూడదు!' అని అరుస్తారు.]

భటుల కేకలు

[మళ్ళీ] అమీరాన్ ఉల్ మిల్లాత్! ఘాజీ! బత్షికన్! బత్షికన్!

అ ను చ రు డు

[బిగ్గరగా] అల్లాఆజ్ఞ! బత్షికన్!

గ జ్న వీ

[తల యెత్తి రాజఠీవితో స్ఫుటంగా] నేను విగ్రహధ్వంసకుణ్ణి కాని విగ్రహాలు అమ్మేవాడను కాను!

భ టు లు

జయ బఖ్తికన్ ! జయ బఖ్తికన్ !

[మహాంతు చేతులెత్తుకొని రోదనముచేస్తూ వెళ్ళిపోతాడు. గజ్నవీ గండ్రగొడ్డలితో మళ్ళీ ఒక్క దెబ్బకొట్టగానే లింగము మూడు వక్కలుగా పగిలి అందులోనుంచి రత్నరాసులు కారుతవి. వాటిని చూడగానే గజ్నవీ ముఖము వికాసము పొందుతుంది. మహమ్మదీయుల 'దీన్ దీన్' ధ్వానులతో సోమనాథుని "జయీ భవ సోమనాథ ! అనే ధ్వనికూడా వినబడుతుంది.]

గ జ్న వీ

ఇంకా దేవాలయంలో ఉన్న వస్తువులన్నీ ఒంటెల కెత్తండి. ఈ మూడు విగ్రహపు తునకలూ గౌరవంతో ఉంచండి. గజ్నవీ మక్కా మదీనా మసీదులలో ఇవి బఖ్తికన్ కీర్తి శాశ్వతముగా చాటుతూ ఉండవలె !

అ ను చ రు డు

పాపము ! తననే రక్షించుకో లేని దేవుడు భక్తుల నేమి రక్షిస్తాడు !

సోమ నాథుడు

[ప్రవేశించి] జయ జయ విగ్రహధ్వంసక !

వృద్ధురాలు

[ప్రవేశించి] జయ జయ విగ్రహధ్వంసక !

[తెర పడుతుంది. జయ జయ ధ్వానులూ దీన్ దీన్ అనే కేకలూ కొంతసేపటివరకూ వినబడతవి.]

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

# ఆరవ రంగము

[శిథిలమైన దేవాలయపు ఆవరణము. అక్కడక్కడ శవాలూ నెత్తురు మడుగులూ భయంకరముగా ఉన్నవి. అది శ్మశానమునలె కనబడుతూ బీభత్సంగా ఉన్నది. మొదటి రంగములో వచ్చిన ముగ్గురు పౌరులూ, వృద్ధురాలూ, సోమనాథుడూ అర్ధదిగంబర వేషాలతో నృత్యము చేస్తూ ఉంటారు. మధ్య పారశీకుడు కూడా కొంతసేపు కనపడిపోతాడు.]

ఒకటవ పౌరుడు

జయీ భవ సోమనాథ !

రెండవ పౌరుడు

దిగ్విజయీ భవ దిగంబర !

మూడవ పౌరుడు

వందే శ్మశాన సంచర !

వృద్ధురాలు

వందే మాయా తామస హర !

సోమ నాథుడు

శూల పినాక భయానక వందే !

ఒకటవ పౌరుడు

ప్రమథగణాధిప, భైరవ, వందే !

రెండవ పౌరుడు

ఉగ్ర, రుద్ర, త్రిపురాంతక, వందే!
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

మూడవ పౌరుడు

కృత్తివాస, గంగాధర, వందే

వృద్ధురాలు

దక్ష మహాధ్వర ధ్వంసక వందే!

సోమ నాథుడు

జయ జయ, మృత్యుంజయ, జయ, స్మరహార!

మొదటిపౌరుడు

వందే, వృషభధ్వజ, పన్నగ ధర!

రెండవ పౌరుడు

వందే అంధక రాక్షస సంహార !

మూడవ పౌరుడు

వందే త్ర్యంబక, కచీకృతాంబర !

వృద్ధురాలు

వందే హారీకృత నర కర్పర !

సోమ నాథుడు

జయ జయ ప్రళయ మనోహర, జయ హర !

ఒకటవ పౌరుడు

శివ, భవ, హర హర, శంభో, శంకర !

రెండవ పౌరుడు

సకల రూపహర, హర హర, జయ జయ !

మూడవ పౌరుడు

అవిదిత కేళీప్రియ, హర, జయ జయ !

వృద్ధురాలు

భీకర కాళీ ప్రియ, హర, జయ జయ!

సోమనాథుడు

జయ, లయతాండవ పర, హర, జయ జయ!

అ ం ద రూ

హరహర హరహర జయజయ జయ జయ
జయ జయ హరహర హరహర జయ జయ!
[అంటూ వలయాకారంగా నృత్యము చేస్తారు.]

[తెరలో]

యథాప్రకారము సోమనాథస్వామి సముద్రతీరాన వెలసినాడు! సముద్రుడు స్వయముగా స్వామికి అభిషేకము చేస్తున్నాడు!

అ ం ద రూ

జయ జయ సోమనాథ!

[ఆనందముతో కేకలు వేస్తూ అందరూ నిష్క్రమింతురు.]

,

# నోరి గ్రంథములు

1. నారాయణ భట్టు — రు 4—0
   (నన్నయనాటి చరిత్రాత్మక నవల తెలుగు భాషాసమితి బహూకృతినందినది)
2. రుద్రమదేవి — 4—0
   (తిక్కననాటి చరిత్రాత్మక నవల)
3. కర్పూర ద్వీపయాత్ర (పిల్లల నవల) — 1—4
4. వాఘిరా (అజంతా నవల) — 1—0
5. రుద్రమదేవి (సంక్షిప్తము) — 1—0
6. తేనె తెట్టె (నాలుగు నాటికలు) — 1—0
7. సోమనాథ విజయము (నాటిక) — 1—0
8. శ్రీ దేవీభాగవతము — 5—0
   (౧, ౨, ౩ స్కంధములు, చంపూ కావ్యము)
9. మల్లారెడ్డి
   (రాబోవు నవల ఎఱ్ఱయనాటిది)

ప్రాప్తిస్థానము:

నోరి నరసింహ శాస్త్రి

నోరివారు : రేపల్లె.

